# జోర్డాన్




రచన:

ఎ. బి. కె. ప్రసాద్

# జోర్డాన్

రచన:
ఎ. బి. కె. ప్రసాద్

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# జోర్డాన్

**16** వ శతాబ్దంలో సులేమాన్ ప్రభుత్వం క్రింద ఏర్పడ్డ ఒట్టొమాన్ మహాసామ్రాజ్యం (టర్కీ సామ్రాజ్యం) వాయువ్యంగా జర్మన్ సరిహద్దులవరకు విస్తరించింది. అదే విధంగా ఉత్తరాఫ్రికా ప్రాంతంలో అధికభాగం యీ సామ్రాజ్యంలో కలిసిపోయింది. దీనిలో అంతర్భాగమే సిరియా దేశం. ఈ దేశం బ్రిటన్, ఫ్రాన్సుల మధ్య విభజింపబడింది. 1919 లో సిరియా, లెబనాన్, జోర్డాన్, పాలస్తీనా - ఇవన్నీ ఒట్టొమాన్ సామ్రాజ్యంలో అంతర్భాగంగానే వున్నాయి.

అయితే విభజించి - పాలించాలనే దుర్బుద్ధిని విడనాడ లేని బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం ఆయా దేశాల్ని ఫ్రెంచి సామ్రాజ్యవాదులతో కుమ్మక్కుఅయి విభజించ నారంభించారు. ఈ లోపునే 1917 లో బాల్ఫర్ ప్రకటన వెలువడింది. ఫలితంగా "యూదులకు ప్రత్యేకమైన మాతృభూమి"ని నెలకొల్పడం ఆ ప్రకటన లక్ష్యంగా వుంది. దీన్ని అవకాశంగా తీసుకుని వెంటనే బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు పై దేశాల్ని తమ మధ్య పంచుకున్నాయి. సిరియా, లెబనాన్‌లు ఫ్రెంచివారి అధీనం

లోకి వెళ్ళాయి. జోర్డాన్, పాలస్తీనాలు బ్రిటిష్ ఆధిపత్యం లోకి వచ్చాయి.

ఈ విధంగా ఒకనాడు మహాప్రభలా వెలిగి, యూరప్ నంతటినీ తమ చేతుల్లో ఆడించిన అరబ్ జాతి పరాయివారి జోక్యంతో కాలక్రమేణా ఛిన్నాభిన్నం కాజొచ్చింది.

ఆతర్వాత అనేక దశలు గడిచాయి. కాలచక్రం మరికొంత తిరిగింది. ప్రపంచంలో దాస్యదగ్ధ దేశాలు చైతన్య ప్రదీప్తమై పురోగమిస్తున్నాయి. ఈ పురోగమనపథంలో అరబ్ జాతీయత కూడా ఒక భాగమే.

ఆవిధంగా పెల్లుబుకుతున్న జాతీయోద్యమాన్ని అణచి వేయడం సామ్రాజ్యవాదులకు పరిపాటైంది. సామ్రాజ్య వాదుల బానిస శృంఖలాలను ఛేదించుకున్న భారత మహా ప్రజలకు, తదితర దేశాల జాతీయోద్యమ వెల్లవను, వారి లక్ష్యాలను అర్థం చేసుకోవడం కష్టంకాదు.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం ముంచుకొస్తున్న ప్రజా వెల్లువనుతట్టుకోలేక బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు తామింతకాలంగా 'రవి అస్తమించని సామ్రాజ్యాలు'గా వేటిని భావిస్తూవచ్చారో ఆ సామ్రాజ్యాల పునాదులే కదల నారంభించాయి. ఆసియాలో అనేక దేశాలు స్వాతంత్ర్యం పొందాయి. అట్టివాటిలో పశ్చిమఆసియాలోని జోర్డాన్, ఈజిప్టు, సిరియా, లెబనాన్ మున్నగునవి ఒక భాగం.

ప్రధానంగా నూనె పుష్కలంగాలభించే ప్రాంతమైన పశ్చిమాసియాను వదలిపెట్టడం బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు అంత యిష్టంగా లేదు. ఇంతలోనే అమెరికన్ సామ్రాజ్య

వాదులు బ్రిటిష్ వారికి పోటీగా వచ్చారు. "ఆధునిక సామ్రాజ్య వాదం ఒకవిధంగా నూనె సామ్రాజ్యవాదమే" నని పండిట్ నెహ్రూ అన్న మాటల్లో ఎంతైనా వాస్తవం వుంది. పశ్చిమాసియాలోని నూనె సంపదంపై బ్రిటన్, అమెరికాలమధ్య పోటీ ప్రారంభమైంది. పశ్చిమాసియాలోని నూనె ఉత్పత్తిలో 1939 లో అమెరికా వాటా 12 శాతం వుంటే 1957 నాటికి 80 శాతం పెరిగింది. దీన్నిబట్టి అమెరికన్ సామ్రాజ్యవాదులు మధ్యప్రాచ్య రాజ్యాల్ని తమ హస్తగతం చేసుకోడానికి ఏవిధంగా ప్రయత్నిస్తున్నారో బోధపడుతుంది.

తమ ప్రయత్నాలు నిరాఘాటంగా కొనసాగేందుకే బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులు అరబ్ దేశాల మధ్య తంపులు పెడుతున్నారు. ఇందుకై మొదట్లో "ట్రూమన్ చతుస్సూత్ర ప్రణాళిక" నొకదాన్ని తయారుచేశారు. ఇప్పుడు "ఐసెన్‌హోవర్ పథకాన్ని" రూపొందించారు. మిాదుమిక్కిలి అరబ్ రాజ్యాల్ని దోచుకొనేందుకని "స్నేహం" పేరుతో దురాక్రమణ కూటాల్ని అరబ్ ప్రజలపై రుద్దారు. ఈ కార్యక్రమాలన్నీ ఆయా దేశాల లోని అభివృద్ధినిరోధక ప్రభుత్వాల అండతో చేసినవే. వీలుచిక్కని ప్రతిచోటా ఆయా ప్రాంతాల్లోని ప్రభుత్వాల్ని పడగొట్టడానికి కూడా సామ్రాజ్యవాదులు వెనుకంజ వేయ లేదు. అయితే యీ దుర్బుద్ధిపూర్వక చర్యలను ఆయా దేశాల ప్రజలుమాత్రం తీవ్రంగా యెదుర్కొంటున్నారు.

ఫలితంగానే ఇటీవల లెబనాన్‌లో విప్లవం చెలరేగింది. అలాగే 1958 జూలై 14 న బాగ్దాద్ కూటమిలో భాగ

స్వామిని అయిన ఇరాక్ ప్రభుత్వం పతనమైంది. ప్రజల క్రోధాగ్నిలో విద్రోహులు భస్మమైనారు. ఈ క్రోధాగ్నిజ్వాలలు సామ్రాజ్యవాదులకు జోహుకుం అనే జోర్డాన్‌కు కూడా ప్రాకాయి. అక్కడి ప్రజలు కూడా హుస్సేన్ రాజు నియంతృత్వ విధానాలకు వ్యతిరేకంగా తిరుగుబాటు లేవదీయ ప్రయత్నిస్తున్నారు. ఈ లోపుగా బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులు లెబనాన్, ఇరాక్, జోర్డాన్ లను తమ అంగబలంతో లొంగదీయ యత్నిస్తున్నారు. ఆయా దేశాల్లో సైన్యాలను మోహరించి వుంచారు. ఆవిధంగా ప్రపంచ సామ్రాజ్యవాదశక్తులు ఒక్క పశ్చిమాసియాలోనే గాకుండా యావత్తు ప్రపంచానికే ప్రమాదం తెచ్చిపెట్టారు.

ఈ సందర్భంలో బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదుల చేతుల్లో చిక్కుకుని, స్వాతంత్ర్యంకోసం ఉవ్విళ్ళూరుతున్న జోర్డాన్ దేశం పూర్వాపరాలను తెలుసుకోవడం అవసరం.

# 7

## గత చరిత్ర

"ఆసియాలో ప్రతిచోటా బ్రహ్మాండమైన ఉద్యమం పెరిగి పెద్దదై మరింత బలాన్ని పుంజుకొంటోంది... కోట్లాది ప్రజలు స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల కోసం, నూతన జీవన విధానంవైపు మేల్కొంటున్నారు." (1913 లో లెనిన్)

జోర్డాన్ పశ్చిమాసియా దేశాలలో ఒకటి. సిరియా, ఇరాక్, సౌదీఅరేబియా, ఇజ్రాయల్, లెబనాన్‌లు దానికి సరిహద్దు దేశాలుగా వున్నాయి. వైశాల్యం 37,500 చదరపు మైళ్ళు; జనాభా 15 లక్షలు. వీరిలో అధికసంఖ్యాకులు అరబ్ ముస్లిం జాతులే. జనాభాలో అత్యధికభాగం పశ్చిమ జోర్డాన్‌లో కేంద్రీకరించబడి వున్నారు. రాజధాని అమ్మాన్. దేశంలోకల్లా పెద్దనగరమైన అమ్మాన్‌లోనే లక్షమంది జనాభా నివసిస్తున్నారు.

జోర్డాన్• పాలస్తీనాకు తూర్పుగా వుంది. జోర్డాన్ నదికి యివతలగా వుంది. గతంలో యీ భాగం ఫైజుల్ రాజు అధి

---

•పాలస్తీనాలో యూదులకు ప్రత్యేక రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలంటూ ప్రారంభమైన "జియోనిస్టు" ఉద్యమ ప్రభావంవల్ల, 1948 లో ఐరాస పాలస్తీనాను యూదు, అరబ్బులమధ్య విభజించి "ఇజ్రాయిల్" అనే ప్రత్యేక యూదు రాష్ట్రాన్ని నిర్మించింది. నాటినుండి పాలస్తీనా అంటే ఇజ్రాయిల్‌గానే వ్యవహరించ బడుతోంది.

పత్యంక్రిందనున్న అరబ్ సిరియన్ రాజ్యంలో అంతర్భాగం గానే వుండేది. కానీ క్రమేణా సిరియా ఫ్రెంచి సామ్రాజ్య వాదుల హస్తగతం అవడంతోనే జోర్డాన్‌నదికి తూర్పుగా వున్న యీ భాగం ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం బ్రిటిష్ వారి చేతుల్లో చిక్కింది. బ్రిటిష్ దురాక్రమణదారులకు యీ భాగం యెంతో కీలకప్రాంతం. పాలస్తీనాలో అంత ర్భాగంగా వుంటూవచ్చిన యీ జోర్డాన్‌ను దానికి కలిపి వేయవచ్చు గాని, సామ్రాజ్యవాదం సుస్థిరంకావాలంటే 'విభజించి – పాలించడం' ప్రధానాశయంగా వుండాలి! ఈ జోర్డాన్ భూభాగంగుండా భారతదేశానికి విమానమార్గం యేర్పచ్చుకోవడం బ్రిటిష్‌వారి ప్రధాన లక్ష్యంగావుంటూ వచ్చింది. అంతేకాదు; బాగ్దాద్, పాలస్తీనాలోని హైఫాలను కలిపే రైలు మార్గం జోర్డాన్‌నుండే పడుతుంది. అందుకు అనుగుణ్యంగానే వారీ ప్రాంతాన్ని తమ అదుపాజ్ఞల్లో వుంచు కున్నారు.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం తుర్కీవారు అప జయం పొందడంతో అప్పటివరకూ ఒట్టామాన్ సామ్రా జ్యంలో భాగంగావున్న పాలస్తీనాను బ్రిటిష్‌వారు ఆక్ర మించుకొన్నారు. పాలస్తీనాను పరిపాలించడం ఆ దేశ ప్రభు త్వానికి "తెలియద"న్న మిషతో నానాజాతి సమితివారు బ్రిటిష్‌వాళ్ళకు పాలస్తీనాపై "మాండేటరీ అధికారాల" (Mandatory-powers) నిచ్చారు. అంతట బ్రిటిష్‌సామ్రాజ్య వాదులు పాలస్తీనాను రెండు భాగాలుగా విభజించారు. ఈ రెంటిని విభజించేది జోర్డాన్ నది. జోర్డాన్ నదికి

తూర్పుగా వున్న ప్రాంతాన్ని "ట్రాన్స్-జోర్డాన్" అని నామకరణం చేశారు. ఆ విధంగా 1920 సెప్టెంబర్ 1 నాటికి "ట్రాన్స్-జోర్డాన్" అనే పేరుతో ఒక కొత్త రాజ్యం ఆవిర్భవించింది. ఈ రాజ్యానికి ఫైజుల్ రాజు తమ్ముడు అమీర్ అబ్దుల్లాను రాజుగా నియమించారు. ఇతడు ఆదినుండీ పూర్తిగా బ్రిటిష్‌వారి కీలుబొమ్మగానే వ్యవహరించాడు. 1922 నాటికల్లా ట్రాన్స్-జోర్డాన్ బ్రిటిష్‌వారి 'అధినివేశ' రాజ్యంగా మారిపోయింది. మరోవైపున ఫైజుల్‌ను బ్రిటిష్ వాళ్లు ఇరాక్ రాజుగా గద్దెనెక్కించారు.

ఆ విధంగా ప్రపంచ సంస్థ అని చెప్పబడ్డ నానాజాతి సమితివారు, ఏవో మిషలుకల్పించి మాండేటరీ అధికారాలనే పేరుతో స్వతంత్ర దేశాల్ని కబళించివేయడానికి సామ్రాజ్యవాదులకు ఎంతటి అవకాశాల్ని కల్పించారో పై విషయాలన్నీ బోధపడుతుంది. ప్రాచ్యప్రజలకత్యంత స్నేహపాత్రుడైన లెనిన్ మహాశయుడు ఈ మాండేటరీ విధానంలోని లోగుట్టును బట్టబయలుచేస్తూ 1919 నవంబరులో చెప్పిన వాఖ్యాలు గమనించ దగ్గవి:

"వలస దేశాలపై అధికార పంపిణీనిగూర్చి సామ్రాజ్యవాదులు మాట్లాడుతున్నారంటే అర్థం — ఆయా దేశాల్ని కొల్లగొట్టి, సంపదనంతా దోచుకోడానికే ఈ అధికార పంపిణీలోని అసలుగుట్టు అనేది మనకు బోధపడుతుంది. అంతేకాదు, ప్రపంచంలోని అత్యధిక ప్రజానీకంపై ఏ కొద్దిమంది స్వార్థపరులకో 'అధికారాన్ని' దఖలుపర్చడం తప్ప ఇది అన్యదా కాదు!"

చివరకు 1923 సం॥ మే 25 నాటికి ట్రాన్స్-జోర్డాన్‌ను స్వతంత్ర రాజ్యమని ప్రకటించారు. కాని ఇది మాట

ల్లోనే. వాస్తవానికి దేశానికి సంబంధించిన ప్రధానాధికారాలన్నీ బ్రిటిష్‌వాళ్ళ గుప్పెటలోనే వున్నాయి. 'స్వాతంత్ర్యం' పేరుతో అసలు ఆయువుపట్టుల్ని వదలడం బ్రిటిష్ వాళ్ళ రాజనీతి చరిత్రలోనే లేదు! ఆతర్వాత జోర్డాన్‌కూ, బ్రిటిష్‌వారికీ జరిగిన సంధి సంప్రదింపుల ననుసరించి పాలస్తీనాకు, ఈదేశానికి కలిపి ఒకే బ్రిటిష్ హైకమిషనర్‌ను నియమించారు. ఇంతటితో రెండు ప్రాంతాల్లోను నాటక మాడడానికి బ్రిటిష్‌వారికి బాగా అవకాశం చిక్కింది. ఫలితంగా జోర్డాన్ పొలిమేరల్లోవున్న మరికొన్ని భూభాగాల్ని కలుపుకుని బ్రిటిష్‌వాళ్ళు ట్రాన్స్ - జోర్డాన్ రాజ్యాన్ని మరికొంత విస్తరింప జేసుకున్నారు. తమ స్వప్రయోజనాల దృష్ట్యా ప్రసిద్ధిచెందిన అకాబా పట్టణాన్ని రేవు పట్టణంగా వృద్ధిచేశారు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదుల తాబేదారుగా తయారైన అమీర్ అబ్దుల్లా దేశంలో నిరంకుశాధికారాన్ని చెలాయించ సాగాడు. కొద్దికాలంలోనే దేశమంతటా అబ్దుల్లా పరిపాలన పట్ల అసంతృప్తి జ్వాలలు అలుముకున్నాయి. ప్రజాస్వామిక పార్లమెంటును ఏర్పర్చవలిసిందిగా ప్రజలు ఆందోళన చేశారు. బ్రిటిష్‌వారి సాయంతో అబ్దుల్లా యీ ఆందోళనోద్యమాన్ని అణచివేశాడు. దేశంలోని పత్రిక లన్నింటిపైన నిషేధాజ్ఞలు విధించాడు. విచక్షణారహితంగా నాయకులను దేశ బహిష్కృతుల్ని చేశాడు. 1927 సంవత్సరంలో డెమాక్రటిక్ గ్రూపు అనే ఒక పార్టీ తలెత్తింది. 1928 లో ట్రాన్స్-జోర్డాన్ బ్రిటిష్ ప్రభుత్వంతో ఒక ఒడంబడిక కుదుర్చుకుంది. ఈ ఒడం

బడికకు వ్యతిరేకంగా యీ కొత్త పార్టీ ప్రజాందోళనను రగుల్కొల్పింది. పార్లమెంటు స్థాపనా, దానికి బాధ్యులైన మంత్రివర్గమూ (Cabinet responsible to Parliament) ఏర్పడాలని ఎలుగెత్తి చాటారు. కాని యీ కోర్కెలు, ఆందోళన చెవిటివాడి ముందు శంఖం పూరించినట్లయింది. మిాదుమిక్కిలి ప్రజా ఉద్యమాన్ని అణచివేయడానికి అబ్దుల్లా ప్రభుత్వమూ, బ్రిటిష్ సామ్రాజ్యవాదులూ పూను కొన్నారు. చివరకు వాస్తవానికి యీ సంధితో జోర్డాన్, బ్రిటిషు సామ్రాజ్యంలోనే అంతర్భాగంగా రూపొంది నట్లయింది !

ఈ సంధిప్రకారం బ్రిటిష్‌వారు ట్రాన్ - జోర్డాన్‌కు స్వపరిపాలన నంగీకరించినా "సర్వస్వతంత్ర" రాజ్యాన్ని ఒప్పుకోడానికి బ్రిటిష్‌వాళ్ళకు ప్రతిష్ఠ అనే ముసుగు అడ్డు వచ్చింది. ఈ సంధితో ప్రధానమైన అధికారాలన్నీ (ఆర్థికవిషయాలు, విదేశాంగవిధానం మొ॥) బ్రిటిష్‌వారికే దఖలు పడ్డాయి.

1928 లోనే శాసనసభను సమావేశపర్చే ప్రయత్నం జరిగినా, దేశంలోని ప్రతిపక్షాలు అందుకు నిరాకరించాయి. ఇందుకు కారణం లేకపోలేదు. అబ్దుల్లా పాలనకు వ్యతిరే కంగా దేశంలో ప్రతిఘటన ఎక్కువ కాజొచ్చింది. 1928, జులై 25 న హుసేన్ పాషాతర్వా నాయకత్వాన జాతీయమహాసభ ఒకటి ఏర్పాటయింది. ఈ సభ నాయకత్వాన జోర్డాన్ ప్రజలు "జాతీయ ఒడంబడిక" నొకదాన్ని రూపొందించుకున్నారు. జోర్డాన్ స్వాతంత్ర్య

ప్రతిపత్తికి విఘాతంకలిగించే, బ్రిటిష్ -జోర్డాన్ ఒడంబడికను తెగనాడారు.

"ట్రాన్స్ జోర్డాన్ సర్వస్వతంత్ర అరబ్ దేశం" అని ప్రపంచానికి యెలుగెత్తి చాటారు. అంతేగాదు; చాల కాలంగా వాయిదా పడుతూవచ్చిన ఎన్నికల్ని 1929 లో జరపడానికి ప్రభుత్వం నిర్ణయిస్తే, వీటినికూడా అధిక సంఖ్యాకులు బహిష్కరించారు. ఆవిధంగా దేసంలోని నిరంకుశ రాచరికానికి బ్రిటిష్ సామ్రాజ్య వాదులకు వ్యతిరేకంగా జోర్డాన్ అంతటా బహుముఖాలుగా తలెత్తిన ప్రతిఘటన ప్రపంచ ప్రజల దృష్టిని ఆకర్షించ నారంభించింది.

అంతేకాదు; "యూదులకు ప్రత్యేకమైన మాతృ భూమి" అన్న విషయమై 1929 లో పాలస్తీనాలోని యూదు లకు, అరబ్బులకుమధ్య తీవ్రమైన కొట్లాటలు సంభవిం చాయి. ఆ సందర్భంలో బ్రిటిష్‌వారికి, బాల్ఫర్ ప్రకట నకు వ్యతిరేకంగా ట్రాన్స్ - జోర్డాన్‌లోకూడ పెద్దఎత్తున ప్రదర్శనలు జరిగాయి. దాన్నిబట్టి నాటినుండికూడ జోర్డాన్ ప్రజల్లో బ్రిటిష్ సామ్రాజ్యవాదులపట్ల ఎంతటి క్రోధా వేశాలు పెల్లుబుకుతున్నాయో తెలుస్తుంది.

## వ్యవసాయం

జోర్డాన్ దేశంలో అత్యధికభాగం ఎడారి ప్రాంతం. ఇది వ్యావసాయక దేశం. సేద్యయోగ్యమైన ప్రాంతాలన్నీ జోర్డాన్ పశ్చిమభాగంలోనే వున్నాయి. ఈ ప్రాంతాలన్నీ జోర్డాన్‌నది, "డెడ్‌సీ" లకు ఆనుకునే వున్నాయి. గోధుమ,

బార్లి, మొక్కజొన్న, చిక్కుళ్ళు మొదలైనవి యిక్కడి ప్రధాన పంటలు. నిమ్మ, ఆలివ్ పండ్లను జోర్డాన్ లోయలో పండిస్తారు. జోర్డాన్ యెగుమతి వ్యాపారంలో అవిసిపండ్లు ప్రధానపాత్ర వహిస్తున్నాయి. ఈ అవిసిపండ్లనుండి నూనెను తయారుచేయడంకోసం బ్రిటిష్ వారు జోర్డాన్ నుండే యెక్కువగా యీ పండ్లను దిగుమతి చేసుకుంటారు. వలస దేశాలనుండి ముడిసరుకుల్ని దిగుమతి చేసుకొని తిరిగి వాటితో తయారయ్యే సరుకుల్ని ఎక్కువ ధరలకు వలస ప్రజల కమ్మజూపడం బ్రిటిష్ సామ్రాజ్యవాద గుత్తవ్యాపారవర్గ లక్షణాలలో ఒకటి. ఇదేవిధంగా తమ దేశంలో తయారైన ఆలివ్ నూనెను బ్రిటిషువాళ్లు తిరిగి జోర్డాన్‌లో యెక్కువ ధరలకు అమ్ముతున్నారు. ఫలితంగా కోట్లాది పౌండ్ల లాభాలను సంపాదిస్తున్నారు.

జోర్డాన్ ఆర్థికరంగంలో మరో ప్రధానమైన విషయమేమంటే, యిక్కడ పశువుల పెంపకం అధికం. గ్రామీణ ప్రాంతాల్లో నేటికీ అర్ధ భూస్వామ్య సంబంధాలు వేళ్లూనుకునే వున్నాయి. రైతాంగం అంతా భూస్వామ్యవర్గ దయాదాక్షిణ్యాలమీదనే ఆధారపడవలసి వస్తోంది. వీటికితోడు దేశంలో ఏ ఒకటి రెండు ప్రభుత్వాలో తప్ప, మిగతా మంత్రివర్గాలన్నీ అభివృద్ధి నిరోధకులవడంతో రైతాంగాన్ని పీల్చిపిప్పిచేయడానికి భూస్వాములకు మరింత అవకాశాలు చిక్కాయి. దీనితో రైతాంగంలోకూడా ప్రభుత్వజాతీయ విధానాలపట్ల తీవ్రఅసంతృప్తి ద్యోతకమవుతోంది. దేశంలో అనేకప్రాంతాలలో నీటివనరులు లేవు. కృత్రిమ నీటిపారుదల సౌకర్యాలు

కల్గించవలసిన అవసరం ఎంతో వుందని జోర్డాన్‌ను సందర్శించిన పరిశీలకులు కూడా చెపుతున్నారు. ఇక సాగుపద్ధతులు చూద్దామా, చాల ప్రాచీనమైనవిగా వున్నాయి.

## ప రి శ్ర మ లు

సామ్రాజ్యవాద కుట్రలవల్ల కేవలం వ్యావసాయక రంగంలోనే కాకుండా, జోర్డాన్ పారిశ్రామికంగా కూడా వెనుకబడివుంది. జోర్డాన్‌లో నేడు చెప్పుకోదగ్గ పరిశ్రమలు లేవనే చెప్పాలి. అదికూడా ఏదైనా వుందా అంటే అది 1956 లో నెలకొల్పబడ్డ అవిసె నూనె ఫ్యాక్టరీ. అలాగే యిటీవలనే ఒక సిమెంటు ఫ్యాక్టరీ కూడా నెలకొల్పబడింది. దేశం మొత్తంమీద చిన్నవి మూడు పొగాకు కంపెనీలు మాత్రమే వున్నాయి. వీటిలో 1500 మంది కార్మికులు పనిచేస్తున్నారు. అలాగే, కొయ్యసామాగ్రి తయారుచేసే చిన్న చిన్న ఫ్యాక్టరీలు, పిండిమరలుకూడా వున్నాయి.

దేశంలో ఖనిజసంపదను గూర్చి నేటివరకు సరైన సర్వే జరుపబలేదు. ఇంతవరకూ బయటపడ్డ ప్రధానమైన ఖనిజాలు — అమ్మాన్‌వద్దనున్న ఫాస్ఫేట్ నిధులు. ఈ ఫాస్ఫేట్ ఖనిజం దాదాపు 3 కోట్ల టన్నులవరకు లభ్యమవుతుందని అంచనా. అయితే ఇంతవరకూ ఖనిజ సంపద విషయమై సరైన శ్రద్ధ చూపకపోవడంవల్ల అవి నిక్షిప్తంగానే వుండిపోయాయి.

జోర్డాన్‌లో ఒకే ఒక్క రైల్వేలైను వుంది. అదికూడా 323 కిలోమీటర్ల పొడవు వుంటుంది. రహదారి సౌకర్యాలు

కూడా అంతంతమాత్రమే. ఒంటెలమీద ప్రయాణంకూడా కద్దు. జోర్డాన్‌కువున్న ఒకే ఒక ప్రధాన రేవుపట్టణం అకాబా. ఇది ఎర్రసముద్రప్రాంతంలో వుంది. జోర్డాన్ విదేశ వ్యాపారంలో అత్యధికభాగం లెబనాన్‌లోని బీరుట్ రేవుగుండా సాగుతూంటుంది. జోర్డాన్ ఎగుమతులు : ఉన్ని, పశువులు, తోళ్ళు, ఫాస్ఫేట్స్ మొదలైనవి. వినిమయ సరుకుల్ని మాత్రం జోర్డాన్ దిగుమతి చేసుకుంటుంది.

## విద్యా విషయాలు

దేశంలో నిరక్షరాస్యత ఎక్కువగానే వుంది. వలస పాలనవల్ల సంక్రమించిన ఈ రుగ్మతను రూపుమాపేందుకు 1954 నాటి నబుల్సీ ప్రభుత్వ హయాంలోమాత్రం కొంతకృషి జరిగింది. ఆయన మంత్రివర్గం పడిపోవడంతో జోర్డాన్ ప్రజల కష్టాలు యథాప్రకారంగానే కొనసాగుతున్నాయి.

నబుల్సీ ప్రభుత్వంలోని విద్యామంత్రిత్వ శాఖవారు వెలువరించిన సమాచారాన్నిబట్టి - 66 లక్షల దీనార్ల (జోర్డాన్ నాణెం) బడ్జెట్‌లోను 12 లక్షల 50 వేల దీనార్లు విద్యకై కేటాయించబడింది. మొగపిల్లలందరికీ, ఆడపిల్లల్లో 40 శాతానికి మాత్రం పాఠశాల సౌకర్యాలు కల్గించబడ్డాయి. విశ్వజనీన ప్రాథమిక విద్యావిధానం ప్రవేశపెట్టబడింది. 1952-'53 లో దేశంలో మొత్తం 487 పాఠశాలలు (ఎలిమెంటరీ, సెకండరీ) వున్నాయి. వీటికి హాజరయ్యే మొత్తం పిల్లల సంఖ్య 1,36,975 మంది. అలాగే 1955-'56 లో దేశంలోని పాఠశాలల సంఖ్య 690 కు చేరుకుంది. ఇందుకు

అనుగుణ్యంగా విద్యార్థుల సంఖ్య 1 లక్షా 52 వేల 572 కు జేసుకుంది.

అయితే యింతకూ జోర్డాన్ దేశంలో ఒక్క యూనివర్శిటీకూడా లేదు. ఫలితంగా ఉన్నత విద్య నభ్యసించగోరే అనేక మంది విద్యార్థులు విదేశాలకు వెళ్ళవలసి వస్తోంది.

17

# కీలకప్రాంతం

మధ్యప్రాచ్య రాజ్యాలకు మధ్యస్తంగా వున్న జోర్డాన్ అనేకవిధాలుగా కీలకప్రాంతం. ఎడారిప్రాంతంగా వున్న ట్రాన్స్-జోర్డాన్‌కు మెరుగులు దిద్ది బ్రిటిష్‌వాళ్లు దాని నొక ప్రసిద్ధ సైనిక స్థావరంగా రూపొందించుకొన్నారు. ఈ సైనిక స్థావరం సరిగ్గా పశ్చిమ ఆసియా రాజ్యాలకు కీలకప్రాంతంలో వుంది. అందుచేతనే బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులు నేడు అటు లెబనాన్ నుండి, యిటు జోర్డాన్‌నుండి చుట్టుముట్టి యిటీవలనే నూతనంగా ఏర్పడ్డ ఇరాక్ రిపబ్లిక్‌ను కూలద్రోయ యత్నిస్తున్నారు. ఇంతవరకూ తమ చెప్పుచేతలలో నున్న ఇరాక్‌లో విప్లవం రావడంతో కంగారుతిన్న సామ్రాజ్యవాదులు మధ్యప్రాచ్యంలోని కొనవూపిరియైన జోర్డాన్‌కు అపరిమితంగా సైనిక సహాయం, చివరకు మారణాయుధాల్ని కూడా చేరవేస్తున్నారు.

ఏ దేశమైనా స్వతంత్రంగా నిలవాలంటే, దానికి రాజకీయంగానే కాకుండా ఆర్థిక స్వాతంత్ర్యం కూడా లేకపోతే దాని మనుగడ పరిపూర్ణం గాదు. జోర్డాన్‌కు స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడుకోవాలంటే ఒకవైపున ఆర్థిక వనర్లు లోటుగా వున్నాయి. మరోవైపున బ్రిటిషువాళ్ళ

ప్రయోజనాలకు అనుగుణ్యంగా నడచుకునే హుస్సేన్ రాజు పాలనవల్ల జోర్డాన్ అధినివేశ రాజ్యంగా వుంటూ వచ్చినా వాస్తవానికది బ్రిటిష్‌వాళ్ళ వలసగానే మెలగుతూ వచ్చింది. ఈ ప్రాంతంలో తమ పలుకుబడిని మరింత విస్తరింప జేసుకొనేందుకై బ్రిటిష్‌వారు "అరబ్ సైన్యా"న్ని (Arab Legion) ఏర్పాటు చేశారు. ఈసైన్యానికి కావలసిన సర్వ హంగుల్నీ — ఆయుధాలు, సైనిక శిక్షణ, ఆర్థిక సహాయం — బ్రిటిష్‌వాళ్ళే సమకూర్చారు. చివరికి ఈ సైన్యానికి బ్రిటిష్ అధికారులే సైన్యాధిపతులుగా వ్యవహరిస్తున్నారు. వీరందరికీ అధిపతి బ్రిటిష్‌వాడైన జనరల్ పౌల్ ఉంటూవుండేవాడు. ఆతర్వాత మరో బ్రిటిష్ "యోధుడు" జనరల్ గ్లబ్ పాషా ఈ సైన్యానికి నాయకత్వం వహించాడు. ఇంతకూ బ్రిటిష్ సేనలతోపాటు ట్రాన్స్-జోర్డాన్‌లో తిష్ట వేసుకునివున్న అరబ్ సైన్యం ప్రధాన లక్ష్యం—పొరుగున వున్న సోదర అరబ్బు దేశాలలోని జాతీయ విమోచనోద్యమాల్ని అణచే పోలీసుదళాలుగా వినియోగపడడమే!

ఈ విధంగా జోర్డాన్ దేశం, హుస్సేన్‌రాజు పాలన క్రిందా, కరడుగట్టిన అభివృద్ధి నిరోధకుడు, బ్రిటిష్ గులాం అయిన గ్లబ్ పాషా లాంటి పోలీసు నిరంకుశాధికారుల పద ఘట్టనక్రిందా 30 ఏళ్ళకు పైగా బ్రిటిషు సామ్రాజ్యవాదుల అడుగుజాడల్లో వుండాల్సివచ్చింది.

కాని ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం ప్రాగ్దేశాలు మేల్కొన్నాయి. ఆసియా ప్రజల స్వాతంత్ర్యోద్యమం మూడు పూవులు ఆరు కాయలుగా పరిఢవిల్లింది. ఈ

స్వాతంత్ర్యజ్యోతి జోర్డాన్ సరిహద్దులకుకూడా వ్యాపించింది. బ్రిటిష్ బానిసబంధాలనుండి విముక్తి కావాలని ట్రాన్స జోర్డాన్ ప్రజలు కూడా డిమాండ్ చేయ నారంభించారు. ఫలితంగా 1948 లో బ్రిటిష్‌వాళ్లు మాండేటరీ అధికారాలను వదులుకుంటూ ట్రాన్స - జోర్డాన్‌కు సూత్రప్రాయంగానైనా స్వాతంత్ర్య ప్రదానంచేయక తప్పలేదు.

అయితే ఇదే సందర్భంలో బ్రిటిష్‌వాళ్ళు ఒక కుట్ర పన్నారు. ట్రాన్స - జోర్డాన్‌లో బ్రిటిషు సేనలుమాత్రం వుండేటట్లుగా బ్రిటన్ జోర్డాన్‌ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చింది. ఫలితంగా 1948లోనే ట్రాన్సు - జోర్డాన్ బ్రిటన్‌తో ఒక అసమసంధిని కుదుర్చుకుంది. నాటినుండి అది ట్రాన్సు - జోర్డాన్ ప్రజలపట్ల 1956 వరకు ఒక బెడదగా తయారై కూర్చుంది. 1949 నాటి పాలస్తీనా యుద్ధానంతరం ట్రాన్సు జోర్డాన్ పాలస్తీనాలో కొంతిభాగాన్ని ఆక్రమించుకుంది. జోర్డాన్‌నదికి పశ్చిమంగావున్న ప్రాంతాలన్నీ ప్రస్తుత జోర్డాన్‌లో అంతర్భాగంగా రూపొందాయి. అప్పటినుండి ట్రాన్సు - జోర్డాన్‌కుబదులు ఈ ప్రాంతాన్ని "జోర్డాన్" అని మాత్రమే వ్యవహరిస్తున్నారు. జనాభా రెండింత లయింది. పశ్చిమపాలస్తీనా నుండి జోర్డాన్‌కు వలసవచ్చినవారే 8 లక్షల 50 వేలమందివరకూ వున్నారు.

పాలస్తీనా నుండి వచ్చిన అరబ్బు కాందిశీకుల విషయంలో కూడా రాజకీయ కుట్రలు సాగుతున్నాయి. అరబ్ జాతీయత, అభివృద్ధి నిరోధక జోర్డాన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా కొత్త పోరాట పుంతలను తెరచింది. జోర్డాన్

ప్రజల్లో ముఖ్యంగా పాలస్తీనానుండి వలసవచ్చిన అరబ్ కాందిశీకుల్లోనూ జోర్డాన్ ప్రభుత్వంపట్ల అసంతృప్తి చెలరేగింది. అరబ్బులకు, యూదు జాతులకు మధ్య వైమనస్యాలు పెంచి తమ పబ్బం గడుపుకోజూస్తున్నారని వీరు గ్రహించారు. మీదు మిక్కిలి బ్రిటన్-అమెరికా అడుగుజాడల్లో నడుస్తూ, దానిరాజకీయ విధానాలకు మడుగులొత్తుతున్న జోర్డాన్ నిరంకుశప్రభుత్వానికి వీరు బద్ధశత్రువులు. అందుచేతనే యీ అరబ్ కాందిశీకుల్ని జోర్డాన్‌నుండి ఏ విధంగా తరలించడమా అని అమెరికా సామ్రాజ్యవాదులూ, జోర్డాన్ ప్రభుత్వమూ యింతకాలంగా కుతంత్రాలు పన్నుతూ వచ్చాయి.

జోర్డాన్‌లో అరబ్ కాందిశీకులకని ఏర్పాటుచేసిన శిబిరాలు 25 వరకూ వున్నాయి. అన్నింటిలోకి పెద్ద శిబిరం జోర్డాన్ లోయలోని "అకాబాజాబార్"వద్దనున్నది. పాలస్తీనా నుండి ఇజ్రాయిల్‌వారిచే తరుమబడ్డ 10 లక్షలమంది అరబ్ కాందిశీకులు ఈ ప్రాంతంలోనే నివసిస్తున్నారు. వారికి గృహ సౌకర్యం మృగ్యం; భూవసతి అంతకన్నా శూన్యం. 1948 తర్వాత కాందిశీకులు తమంతతాముగానే కొన్ని యిళ్లు కట్టుకున్నారు. పాఠశాలలు, వసతి గృహాలు, వైద్యాలయాలు కొన్ని ఏర్పాటు చేసుకున్నారు. అయినా వారి జీవన పరిస్థితులుమాత్రం చాల అధ్వాన్నంగా వున్నాయి. తింటానికి పొట్టనిండా తిండి, కట్ట బట్టా లేక అనేక యమ యాతనలకు గురి అవుతున్నారు. అరబ్ కాందిశీకుల్లో 10 లేక 15 శాతం మందికే స్థిరమైన ఉద్యోగావకాశాలున్నాయి. మిగతావారంతా బొటాబొటీగా తమ జీవితాల్ని గడుపు

తున్నారు. అదికూడా నెలకు 2.50 డాలర్లు చొప్పున అమెరికా, బ్రిటన్, ఐ రా స వర్గాలు యిచ్చే దానధర్మాల మీదనే!

అరబ్ జాతీయోద్యమంలో పాల్గొనకుండా వీరిని తటస్థులుగా వుంచడం యెలా అని జోర్డాన్ ప్రభుత్వం ఆలోచించింది. పశ్చిమ జోర్డాన్ పట్టణప్రాంతాల్లో వున్న అరబ్ కాందిశీకుల్ని దక్షిణాదిన బిదోయిన్ తెగల ఆధిపత్యంలో వున్న ఎడారి ప్రాంతాలకు తరలించ ప్రయత్నించారు. బిదోయిన్ తెగలు హుస్సేన్ రాజు పట్ల ఎంతో "భక్తి ప్రపత్తుల" ను కలిగివుండే తెగలన్నమాట.

వీటన్నింటికితోడు జోర్డాన్ ప్రభుత్వం 1957 నవంబరు ప్రాంతంలో బాగ్దాద్ కూటమికి చెందిన "ఆర్థిక సంఘం", "విచ్ఛిన్నకర చర్యల నిరోధక సంఘం" లో జోర్డాన్‌ను యిరికించినట్లు అరబ్ రేడియో, పత్రికలు ప్రకటించాయి. అంతేకాదు, జోర్డాన్ ప్రభుత్వం యీ తొందరపాటు చర్యకు దిగడానికి కారణం - జోర్డాన్‌లోని అరబ్ కాందిశీకుల్ని యితర చోట్లకు తరలించడానికి విదేశీసహాయం అవసరమయ్యేనని కూడా "అస్ సియాసా" అనే పత్రిక వెల్లడించింది.

ఈ సందర్భంలో బీరుట్‌లోని "న్యూస్ క్రానికల్" పత్రిక విలేఖరి సిరియా ఘటనలపై వ్యాఖ్యానిస్తూ 1957 అక్టోబర్ 1 న యీ విధంగా వ్రాశాడు:

"అమెరికా చేసిన ఘోరమైన తప్పిదాలన్నీ ఐసెన్‌హోవర్ పశ్చిమాసియా పథకాన్ని రూపొందించడానికి తోడ్పడ్డ ఆలోచనా విధానంలో అంతర్భాగమే. అరబ్ రాజకీయరంగంలో అత్యంత ప్రధానమైన రెండు

విషయాల్ని ఐక్ పథకం విస్మరిస్తూంది. అవే - "అరబ్ జాతీయత ఇజ్రాయల్ సమస్యలు"

సిరియాకు వ్యతిరేకంగా పన్నిన కుతంత్రాలు భగ్నం గావడంతో, అరబ్ ఐక్యతను విచ్ఛిన్నం చేయడానికి వాషింగ్టన్ రాజకీయవేత్తలు కొత్త పద్ధతులకు పూనుకున్నారు. ముంచుకొస్తున్న అరబ్ జాతీయోద్యమ వెల్లువముందు యీ 'కొత్త పద్ధతులు' విఫలంకాక తప్పదని తర్వాత ఘటనలు రుజువుచేశాయి.

పాలస్తీనా సమస్యపై ముఖ్యంగా కాందిశీకుల విషయంపై అరబ్ దేశాలన్నీ సంఘీభావంతో మెలగడమే యిందుకు నిదర్శనం.

23

# సామ్రాజ్యవాదుల ఒత్తిడి

పోయిన అధికారాల్ని తిరిగి పొందేందుకు సామ్రాజ్య వాదులు ఎంత నీచస్థితికైనా దిగజారుతున్నారు. బ్రిటిషు సామ్రాజ్యవాదులు జోర్డాన్‌కు స్వాతంత్ర్యాన్ని యిచ్చినట్టే వుండి, జోర్డాన్ జాతీయోద్యమాన్ని వెన్నుపోటుపొడవడానికి 1948 నాటి ఒడంబడికను వినియోగించుకో యత్నించారు. ఫలితంగా, ఈ ఒడంబడికపట్ల జోర్డాన్ ప్రజల్లో అసంతృప్తిని రేకెత్తించింది. ఒకవైపున అరబ్ కాందిశీకులసమస్య; మరొక వైపున నానాటికీ క్షీణిస్తున్న దేశ ఆర్థికపరిస్థితి; ప్రజల అసంతృప్తి; వేరొకవైపున ఆంతరంగిక వ్యవహారాలలో జోర్డాన్‌లో బ్రిటిషు, అమెరికన్ సామ్రాజ్యవాదుల జోక్యం–వీటిలో ఏఒక్కదాన్నీ పరిష్కరించలేని సామ్రాజ్యవాదుల తాబేదారు, అసమర్థుడైన అమీర్ అబ్దుల్లా 1951 లో వధించబడ్డాడు. తర్వాత హుస్సేన్ రాజు సింహాసనాన్ని అధిష్టించాడు. దేశంలోని ప్రధాన రాజకీయపక్షాలన్నీ బ్రిటిషువాళ్ళ గుత్తాధిపత్యానికి వ్యతిరేకంగా పోరాటం నడిపాయి. ఫలితంగా, గతంలో అబ్దుల్లా సాగించినట్లే, హుస్సేన్ రాజుకూడా ప్రజా పోరాటాల్ని బ్రిటిషు, అమెరికన్ సామ్రాజ్యవాదుల అండతో క్రూరంగా

అణచివేశాడు. దేశంలోని రాజకీయపక్షాలపై నిషేధాజ్ఞలు విధించాడు.

1954 లో బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులు పశ్చిమాసియా రాజ్యాల్ని దోచుకునేందుకు, తమ ఆత్మరక్షణ కోసం అరబ్ జాతులమధ్యనే చీలికలు కల్పించడానికే టర్కీ, ఇరాక్, ఇరాన్, బ్రిటన్, పాకిస్తాన్‌లతో దురాక్రమణ పూరితమైన బాగ్దాద్‌కూటమి నొకదాన్ని ఏర్పరిచారు. ఇందులో జోర్డాన్, సిరియాలను యిరికించడానికి బ్రిటిష్, అమెరికన్ పాలకవర్గాలు తీవ్రప్రయత్నాలు చేశాయి. సిరియా ప్రభుత్వం 'దురాక్రమణ కూటమిలో చేరేదిలేదని నిక్కచ్చిగా చెప్పింది. ఇక వూగిసలాడుతున్న జోర్డాన్ ప్రభుత్వంమీద మరింత ఒత్తిడి తేదలచుకున్నారు బ్రిటిష్ వారు. జోర్డాన్‌పై యింతవరకూ తమకున్న పలుకుబడినంతా బ్రిటిష్‌వారీ సమయంలో వినియోగించ దలుచుకున్నారు. ఇందుకు అనుగుణ్యంగానే - బాగ్దాద్ కూటమిలో జోర్డాన్‌ను సభ్యదేశంగా చేర్పించేందుకు 1955 డిసెంబర్ 6 న బ్రిటిష్ ప్రభుత్వం సర్వసైన్యాధిపతి జనరల్ టెంప్లర్‌ను జోర్డాన్ రాజధాని అమ్మాన్‌కు పంపింది.

ఇంతకుముందు మరికొంతగాధ జరిగింది.

1955 నవంబర్ మొదట్లో టర్కీ అధ్యక్షుడు బేయర్ జోర్డాన్‌ను సందర్శించాడు. ఈయన పర్యటనలోని ప్రధానోద్దేశం జోర్డాన్‌ను బాగ్దాద్‌కూటమిలో ఏవిధంగానైనా చేర్చాలనే. ఇది బ్రిటిష్‌వాళ్ళు పన్నిన కుట్ర. చివరకు బేయర్ ప్రయత్నం విఫలమైంది. దురాక్రమణ కూటమిలో

జోర్డాన్ దేశాన్ని యిరికించడానికి జరిగే ప్రయత్నాలకు వ్యతిరేకంగా తీవ్ర నిరసనను తెలియజేస్తూ దేశమంతటా బహిరంగసభలు జరిగాయి. పలుప్రాంతాల్లో మొత్తం 75 వేలమంది విద్యార్థులు సమ్మెలు జరిపారు. అదేవిధంగా 1955 నవంబర్ 21, 22 తేదీలలో ఇరాక్ రాజధాని బాగ్దాద్‌లో, బాగ్దాద్‌కూటమి రాజ్యాల మంత్రుల సమావేశమైనప్పుడుకూడా, కూటమిలో చేరవలసిందిగా ఇరాక్, టర్కీలు ఎంతో బలవంతం చేశాయి.

అంతేగాదు; కూటమి సభ్యదేశాలు జోర్డాన్‌పై అనేక విధాల ఆర్థిక వత్తిడి తెచ్చి తద్వారా దానిని కూటమిలో యిరికించవచ్చునని ఎత్తువేశాయి. ఇందుకు అనుగుణ్యంగానే నవంబర్ మొదటివారంలో ఇరాక్, జోర్డాన్ ప్రభుత్వ ప్రతినిధులు సమావేశమై ఆర్థిక విషయాల్ని గూర్చి చర్చించారు. బాగ్దాద్ కూటమిలో చేరితే 15 లక్షల దీనార్ల అప్పు నిస్తానని ఇరాక్ జోర్డాన్‌కు ఆశ చూపింది! బ్రిటిషువాళ్ళ పెత్తనంకింద నున్న జోర్డాన్ "అరబ్ సైన్యాని"కి ఉపాధ్యక్షుడుగా వుంటున్న జనరల్ జుండీవి, బాగ్దాద్ కూటమిని వ్యతిరేకిస్తున్నాడని 1955 డిసెంబర్ 4 న పదవినుండి తొలగించారు. ఇదే నెలలో జోర్డాన్‌లో అనేకమంది రాజకీయ నాయకుల్ని కూటమిని వ్యతిరేకిస్తున్నారన్న మిషపై అరెస్టు చేశారు. వాస్తవానికి జనరల్ టెంప్లర్ అమ్మాన్ రావడానికి కారణం - జోర్డాన్ గనుక కూటమిలో చేరడానికి ఒప్పుకుంటే, 1948 నాటి అనుసంధిని తగువిధంగా "సంస్కరించ"డానికి అవకాశాలున్నాయని జోర్డాన్ ప్రభుత్వానికి నచ్చజెప్పేందుకే. అరబ్ ప్రజలు

ఈ కుతంత్రాలను ఒకవైపు కనిపెడుతూనే వున్నారు. "జోర్డాన్‌పై కారుమేఘా లలుముకుంటున్నాయి. ఈ కారు మేఘాలు ఆ ఒక్క దేశానికే కాకుండా, అరబ్ దేశాలన్నింటికీ కూడా ప్రమాదకరంగా పరిణమించాయి" అని లెబనాన్ పత్రిక "ఆల్ జారీదా" హెచ్చరించింది.

ఎట్టకేలకు ప్రజా వొత్తిడి మూలంగా అప్పట్లో బాగ్దాద్ ఒడంబడికకు అంటిపెట్టుకొని వుండడానికి జోర్డాన్ ప్రభుత్వం తిరస్కరించింది. 1956 మార్చిలో క్రూరుడైన జనరల్ గ్లబ్‌పాషా దేశంనుండి బహిష్కరించబడ్డాడు. ఆ తరువాత అరబ్ సైనికదళాలకు జోర్డాన్ అధికారులే అధినాథులైనారు.

బాగ్దాద్‌కూటమిలో జోర్డాన్‌ని యిరికించడంలో విఫలులైన సామ్రాజ్యవాదులు దేశంలో అరాచక చర్యల్ని రెచ్చగొట్టడానికి పూనుకున్నారు. ఆర్థికంగా ఎన్నో బెదిరింపులు చేశారు. జోర్డాన్‌గనుక బాగ్దాద్‌కూటమిలో చేరితే—ఆయుధాలు, జెట్‌ఫైటర్లు, తదితర రకాల సహాయం ఎంతో చేస్తామని టెంప్లర్ చూపిన ఆశల్ని పశ్చిమదేశాల పత్రికలు సహితం బయటపెట్టాయి.

అలాకానిపక్షంలో జోర్డాన్‌కి ఆర్థిక సహాయాన్ని నిలిపివేస్తానని బ్రిటన్ బెదిరించింది. ఫలితంగా జోర్డాన్ ప్రభుత్వం బాగ్దాద్ కూటమిలో చేరేవిషయమై 1955 డిసెంబర్ 13 న బ్రిటన్‌తో చర్చలు జరిపింది. దీనితో జోర్డాన్ పార్లమెంటులో ప్రతిపక్ష పార్టీలు ప్రభుత్వ చర్యల్ని తీవ్రంగా ఎదుర్కొన్నాయి. మంత్రివర్గం సంక్షోభంలో

చిక్కుకున్నది. డిసెంబరు 13 న 4 గురు మంత్రులు తమ పదవులకు రాజీనామా లిచ్చారు. 14 వ తేదీన సయిద్ ముఫ్తీ మంత్రివర్గం పతనమైంది.

హుస్సేన్ రాజు ఆల్ మజాలీని పిలిచి నూతన మంత్రి వర్గం ఏర్పర్చమన్నాడు. ఇతను బాగ్దాద్ కూటమిలో "జోర్డాన్ చేరికకు అనుకూలుడేనని" అరబ్ పత్రికలన్నీ ప్రకటించాయి. పాత ప్రభుత్వం పతనంకానడంతో తమకు విజయం లభించిందని టెంప్లర్, బ్రిటిషు పత్రికలుకూడా సంబరపడ్డాయి. కాని జోర్డాన్ ప్రజల వ్యతిరేకతను వారు గుర్తించలేదు.

1955 డిసెంబరు 16న అమ్మాన్ తదితర పట్టణాలలో పెద్దఎత్తున ప్రదర్శనలు జరిగాయి. ఈ ప్రదర్శనల్లో అనేకమంది పార్లమెంటుసభ్యులుకూడా పాల్గొన్నారు. మజలీ మంత్రి వర్గం రాజీనామా యివ్వాలని డిమాండ్ చేశారు. ప్రభుత్వం పోలీసు బలగంతో ప్రజా ప్రదర్శనల్ని అణచ పూనుకున్నది. మరతుపాకులు ప్రయోగించబడ్డాయి. రాజు దేశంలో "అత్యవసర పరిస్థితిని" ప్రకటించాడు. ప్రజారంగా లన్నింటిపైన నిషేధాజ్ఞలు విధించాడు. అవిధంగా కొన్ని రోజులపాటు నిర్బంధ విధానాన్ని లెక్కచేయకుండానే దేశమంతటా ప్రజలు తమ అసమ్మతిని తెలిపారు.

ప్రజా వ్యతిరేకతను అణచడానికి ప్రధాని మజలీ "అసమర్థుడైనాడ"ని హుస్సేన్ రాజు 1955 డిసెంబర్ 19 న పార్లమెంటును రద్దుచేశాడు. మజలీ ప్రభుత్వం అధికారంలో వున్నది అయిదురోజులపాటే. మంత్రివర్గ రాజీనామాతో మూణ్ణాళ్ళముచ్చట అంతమైంది.

డిసెంబర్ 21 న ఇబ్రహీం హాషీమ్ నాయకత్వాన మరో ప్రభుత్వం ఏర్పడింది. ఇంటా బయటాకూడా బాగ్దాద్ కూటమిని బలపర్చే వర్గాలకు ముందు రానున్న పార్లమెంటు ఎన్నికలంటే భీతి పుట్టింది. ఇందుకు అనుగుణ్యంగానే కాన్స్టిట్యూషనల్‌కోర్టు 1956 జనవరి 5 న పార్లమెంటును రద్దు చేయడం న్యాయమైనదంటూ ఒక ఉత్తర్వును జారీచేసింది. అంతట పార్లమెంటు ఎన్నికలు జరుపుదామనుకున్న హాషీం ప్రభుత్వంకూడా చేసేదిలేక రాజీనామా యిచ్చింది.

ఈ దఫా జోర్డాన్ ప్రజల్లో మరింత క్రోధాగ్ని రగుల్కొన్నది. 1956 జనవరి 7 న అమ్మాన్‌లో పెద్దఎత్తున సమ్మె జరిగింది. జనవరి 9 న తేదీన సామీా ఆల్ రిఫాయీా నాయకత్వాన మరో ప్రభుత్వం గద్దెనెక్కింది. ఎటువంటి విదేశీకూటాలలోను జోర్డాన్ పాల్గొనబోదని ప్రధాని రిఫాయీా ఒక ప్రకటనలో తెలియజేశాడు. బ్రిటన్, ఇరాక్‌లు మరో దేశ ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కల్గించుకోరాదని హెచ్చరించాడు. ఈ విధంగా సామ్రాజ్యవాదుల జోక్యం ఒక్క జోర్డాన్ ప్రజల్లోనే గాకుండా, ఆసియా, ఆఫ్రికా దేశా లన్నింటా సామ్రాజ్యవాదులపట్ల ద్వేషానలాన్ని రేకెత్తించింది.

### పార్లమెంటు : ఎన్నికలు

1952 లో జోర్డాన్‌రాజు తలాల్ రూపొందించిన రాజ్యాంగమే నేడు జోర్డాన్ పరిపాలనకు ప్రాతిపదిక. ఎగువ సభ, దిగువసభతో కూడుకున్న పార్లమెంటు వుంది. (జాతీయ శాసనసభ) మంత్రివర్గం పార్లమెంటుకు సమిష్టి బాధ్యత వహిస్తుంది. మంత్రివర్గ స్థానాల విషయంలో

జోర్డాన్, పాలస్తీనీయుల మధ్య సమాన ప్రాతినిధ్య పద్ధతి అమలులోవుంది.

1956 అక్టోబర్ 21 న జరిగిన ఎన్నికల్లో ప్రజాతంత్ర శక్తులకు యింతవరకూ జోర్డాన్ చరిత్రలోనే లేని అఖండ విజయం లభించింది. వాస్తవానికీ విజయం పశ్చిమాసియా లోని సామ్రాజ్యవాద విధానాలకే ఒక గొడ్డలిపెట్టు అని చెప్పవచ్చు.

40 సీట్లలోనూ అత్యధికభాగం అతివాదపార్టీలే గెల్చుకున్నాయి. "నేషనల్ బ్లాక్" (ఇందులో కమ్యూనిస్టుపార్టీ, శాంతిరక్షకుల పార్టీ (Peace - supporters) తదితర అభ్యుదయకర పార్టీలు వున్నాయి); నేషనల్ - సోషలిస్టుపార్టీ, సోషలిస్టుపార్టీ "ఆల్-బాత్" - ఇవీ జోర్డాన్‌లోని అతివాద పార్టీలు. అభివృద్ధినిరోధక వర్గాలకు ప్రాతినిధ్యం వహించే మితవాద అరబ్ కాన్‌స్టిట్యూషనల్ పార్టీకి గత పార్లమెంటు ఎన్నికల్లో 25 స్థానాలు లభిస్తే, 1956 ఎన్నికల్లో కేవలం 4 సీట్లు మాత్రమే లభించాయి. ఇదేవిధంగా జోర్డాన్ ప్రయోజనాల్ని లక్ష్యపెట్టకుండా పశ్చిమ దేశాలతోనే అంటిపెట్టుకుని వుండాలని వాదించే మరికొన్ని అభివృద్ధి నిరోధక వర్గాలుకూడా ఈ ఎన్నికల్లో తీవ్రపరాజయం పొందాయి.

జోర్డాన్ ప్రజలు అదివాదపార్టీల్ని బాగా బలపరుస్తున్నారంటే అర్థం, జాతీయ విమోచనోద్యమ పథాన్ని చేపట్టిన జోర్డాన్ అభ్యుదయకర ప్రజాతంత్రశక్తుల చైతన్యానికి అమోఘమైన నిదర్శన మన్నమాట. ఇటీవలి సంవత్స

రాలలో జోర్డాన్ ప్రజల్లో అత్యధికభాగం ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదుల గుత్తాధిపత్యంనుండి బయటపడేందుకై జాతీయ స్వాతంత్ర్య పోరాటాన్ని కొనసాగిస్తున్నారు. ఆ విధంగా దినదినప్రవర్థమాన మవుతున్న సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ విమోచనోద్యమం జోర్డాన్‌లోని అభ్యుదయకర ప్రజాతంత్రశక్తులు మరింత బలపడడానికి దోహదం చేసింది.

1954 లో ఏర్పడ్డ రాజకీయసంస్థ — "నేషనల్ బ్లాక్" ఈ క్రింది లక్ష్య ప్రకటన చేసింది: వివిధవర్గాల ప్రజల అభిప్రాయభేదా లెలావున్నా దేశంలోని ప్రజలంతా సామ్రాజ్యవాద కుట్రలకు వ్యతిరేకంగా ఐక్యమవ్వాలని పిలుపునిచ్చింది; ఆంగ్లో-జోర్డానియన్ అసమసంధిని రద్దుగావించడం, జోర్డాన్ స్వాతంత్ర్య సార్వభౌమాధికారాల్ని పరిరక్షించడం; దేశంనుండి బ్రిటిష్ సేనల ఉపసంహారణ; ట్రూమన్ చతుస్సూత్ర ప్రణాళిక క్రింద వెనుకటి జోర్డాన్ ప్రభుత్వం కుదుర్చుకున్న ఒడంబడికను రద్దుచేయడం; దురాక్రమణ సైనికకూటాలలో జోర్డాన్‌ని యిరికించడానికి జరిగే ప్రయత్నాలకు తీవ్రప్రతిఘటన జరపడం - యివీ అంతర్జాతీయ సమస్యలకు సంబంధించినంతవరకూ "నేషనల్ బ్లాక్" లక్ష్యాలు. ఇంక జోర్డాన్ ఆంతరంగిక సమస్యలకు సంబంధించిన ఆశయాలు: దేశంలో ప్రజాతంత్ర పరిపాలన నెలకొల్పడం, పౌరహక్కుల రక్షణ, విదేశీ దోపిడీ నుండి దేశ సహజసంపదల్ని రక్షించి ఆర్థిక, సాంఘిక సంస్కరణలను ప్రవేశపెట్టడం.

ఈ లక్ష్య ప్రకటనతోనే, పశ్చిమాసియాలోని బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికన్ సామ్రాజ్యవాద విధానాలకు వ్యతిరేకంగా జోర్డాన్‌లోని అతివాదశక్తులన్నీ తీవ్రమైన ఎన్నికల ప్రచారం సాగించాయి. 1956 ఎన్నికల సమయంలో తలెత్తిన సూయజ్ సంక్షోభం ఈ పోరాటాన్ని మరింత యినుమడింపజేసింది. జోర్డాన్‌లోని ప్రజాతంత్ర శక్తులన్నీ సామ్రాజ్యవాదుల్ని ఎదిరించి పోరాడుతున్న ఈజిప్టు ప్రజలకు అండదండలుగా వుంటామని ప్రకటించారు. జోర్డాన్‌లో ప్రధాన పట్టణా లన్నింటిలోను ఈజిప్టుతో సంఘీభావాన్ని కోరుతూ ప్రజలు పెద్దఎత్తున ప్రదర్శనలు జరిపారు. వీటిని చూసి బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు చీమలూ, జెర్రులూ పాకినట్లయింది. ఇంక ద్వేషాన్ని వుండబట్టలేక, బ్రిటిష్‌వారు అరబ్-ఇస్రాయిల్‌ల మధ్య సంబంధాలు బాగా విషమిస్తున్నా యన్న మిషచూపి జోర్డాన్ ప్రజాశక్తుల్ని అణచడానికి ఇరాక్ నుండి సైన్యాలను దింపారు. ఆవిధంగా ఎన్నికల్లో అతివాద శక్తులు అధికారంలోకి రాకుండా అడ్డితే తమ పాత నాటకాన్ని, ఆడవచ్చునని బ్రిటిష్‌వారు పన్నుగడ పన్నారు. పార్లమెంటు ఎన్నికలకు ఒకవారంరోజులు ముందుగానే బ్రిటిష్ ప్రతిపాద ననుగూర్చి అమ్మాన్‌లో జోర్డాన్-ఇరాక్ సంభాషణల్లో చర్చించారు. ఫలితం శూన్యం. చైతన్యం పొందిన జోర్డాన్ ప్రజలు, పార్లమెంటు ఎన్నికల్లో జోక్యం కల్పించుకోడానికి సామ్రాజ్యవాదుల ప్రయత్నాలను భగ్నంచేశారు.

ఫలితంగా, జోర్డాన్‌ని బాగ్దాద్ కూటమిలో యిరికించేందుకు సామ్రాజ్యవాదుల కుట్రలూ, కూహకాలూ సాగ

లేదు సరిగదా, 1956 అక్టోబరు 21 న జోర్డాన్ ప్రజలు చారిత్రాత్మకమైన తీర్పు నిచ్చారు. జోర్డాన్ చరిత్రలోనే ఆరోజు పర్వదినం. జోర్డాన్ కమ్యూనిస్టుపార్టీ - సోషలిస్టుల మధ్య కుదిరిన ఎన్నికలకు సంబంధించిన ఐక్య కార్యాచరణయే జోర్డాన్‌లో ఆ రోజున అతివాదశక్తుల అఖండ విజయాలకి దారితీసిందనే చెప్పాలి. సొలోమాన్ నబుల్సీ అధ్యక్షతన నూతన ప్రభుత్వం అధికారాన్ని స్వీకరించింది.

# ఐక్ పశ్చిమాసియా పథకం : జోర్డాన్ కల్లోలాలు

"ఐసెన్‌హోవర్ రూపొందించిన పశ్చిమాసియా పథకం అమెరికా జాతీయ జీవనంపైన నూనెకంపెనీల గుత్తాధిపత్యాన్ని నెలకొల్పుకునేందుకు వినియోగించే సాధన. అంతేగాదు; ఈ పథకంవల్ల పశ్చిమాసియాలో ఆయుధపోటీ ఎక్కువవుతుంది. ఫలితంగా తృతీయ ప్రపంచయుద్ధ ప్రమాదాన్ని తగ్గించడానికి మారుగా ఈ పథకం ఆ ప్రమాదాన్ని మరింత ఎక్కువ చేస్తుంది."

[1957 మార్చి 1 న అమెరికా సెనేట్‌లో సెనేటర్ కాఫీవర్ ప్రసంగంలోని భాగం.]

ఐసెన్‌హోవర్ రూపొందించిన పశ్చిమాసియా పథకం లక్ష్యం, దానివల్ల కలిగే ఫలితాలు పై సెనేటర్ ప్రసంగం వల్ల బోధపడుతూంది.

పశ్చిమాసియాలో లభ్యమయ్యే నూనె సంపదను దోచుకోవడంతోపాటు ఆయా దేశాలలోని జాతీయోద్యమాల్ని అణచివేయడం, తమకు అనుకూలంగా లేని ప్రభుత్వాలను కూలద్రోయడంకూడా ఐక్ పథకంలో ఒకభాగం. మీదుమిక్కిలి నూనె పంపకం విషయంలో బ్రిటన్-అమెరి

కాల మధ్య పోటీఎక్కువై అరబ్బుజాతుల్ని పీల్చిపిప్పిచేస్తున్నారు. ఒక్క 1955 వ సంవత్సరంలోనే పశ్చిమాసియా నుండి అమెరికన్, బ్రిటిష్ నూనె గుత్తాధిపతులు 190 కోట్ల డాలర్ల లాభాలను గుంజుకున్నారంటే, నూనెకోసం సామ్రాజ్యవాదు లేవిధంగా అరబ్ దేశాల్ని దివాళాతీయించ సంకల్పించారో బోధపడుతుంది.

ఈ సందర్భంలో ఐక్ పశ్చిమాసియా పథకాన్నిగూర్చి ప్రధాని శ్రీ నెహ్రూ చేసిన వ్యాఖ్యానం గమనించదగ్గది :

" పశ్చిమాసియాలో ఎట్టి 'అధికారశూన్యత ఏర్పడ్డా దాన్ని నింపడానికి అర్హులు ఆ ప్రాంతానికి సంబంధించినవారేగాని అన్యులుకారు. ఆ ప్రాంతంలో బయటవారు అడుగుపెట్టడానికి ప్రయత్నించారా, క్లిష్ట పరిస్థితి ఏర్పడిం దన్నమాటే. ఆ ప్రాంతంలో యింక రక్షణసమస్య కాదు. భక్షణసమస్య మాత్రమే...' ఈ 'అధికారశూన్య' సిద్ధాంతం సామ్రాజ్యవాద వలస పెత్తందార్ల బానిసశృంఖలాల్ని ఛేదించుకుని స్వేచ్ఛావాయువుల్ని పీల్చుకుంటున్న అన్ని దేశాలకు అత్యంత ప్రమాదకరమైనట్టిది ".

ఇది గమనించిన అరబ్ జాతి సామ్రాజ్యవాదులను, వా రాడించినట్లు ఆడే తమ దేశాల ప్రభుత్వాలకు వ్యతిరేకంగా జాతీయ విమోచనోద్యమాల్ని నడుపుతున్నారు. ఐక్ పథకాన్ని అంగీకరించడానికి ఈ జాతులు ససేమిరా ఒప్పుకోవడంలేదు. ఒకవేళ ఒప్పుకున్న దేశమేదైనా వుందంటే "ఇరాక్" వలె పతనంగాక తప్పదు.

1957 మే, జూన్ నెలల్లో జరిగిన సంఘర్షణాలు యిందుకు తార్కాణం. దేశంలోని సైనిక, ఫ్యూడల్

భూస్వామ్యవర్గాల అండతో నబుల్సీ చట్టబద్ధ ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి విదేశీ సామ్రాజ్యవాదులు కుట్రపన్నారు. ఇందుకు వ్యతిరేకంగా ఉద్యమించిన ప్రజానీకంపై హింసాకాండకు పూనుకున్నారు. నేటి జోర్డాన్ సంఘటనలు "ఐక్ పశ్చిమాసియా పథకానికి అగ్నిపరీక్ష" లాంటివని అమెరికన్ పత్రికలే వ్యాఖ్యానించాయంటే ఈ సంఘటనల వెనుక అమెరికన్ పాలకవర్గాల పాత్ర యెంతవుందో అర్థం చేసుకోవచ్చు. సూయజ్ యుద్ధంలో సిగ్గుచేటైన పరాభవంపొందిన తర్వాత, సిరియా రిపబ్లిక్‌ను పడద్రోయడానికి పన్నిన కుట్ర విఫలం కావడంతోను గంగవెర్రులెత్తిన సామ్రాజ్యవాదులు తమ కుట్రలకు జోర్డాన్‌ను అనువైన స్థావరంగా ఎంచుకున్నారు.

అంతవరకూ బాగ్దాద్ కూటమిలో పరోక్షపాత్ర వహిస్తూవచ్చిన అమెరికా బెర్ముడా సమావేశంలో (1957 మార్చి 21 నుండి 23 వరకు) బ్రిటన్‌తో చర్చలు జరిపిన అనంతరం బాగ్దాద్‌కూటమికి ప్రత్యక్షంగా అంటిపెట్టుకుని వుండడానికే నిర్ణయం తీసుకున్నది. ఫలితంగా అరబ్ దేశాలపైన, ముఖ్యంగా జోర్డాన్‌పైన మరింత ఒత్తిడి తెచ్చేందుకే ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు ఈ ఉమ్మడి కుట్రకు ఒడిగట్టారు.

ఐక్ పథకాన్ని ఆమోదించవలసిందిగా అమెరికా విదేశాంగ శాఖవారు ఐసెన్‌హోవర్ ప్రత్యేక ప్రతినిధి జేమ్సు రిఛర్డ్సు ద్వారా జోర్డాన్‌పై తీవ్రమైన ఒత్తిడిని తెచ్చారు. కాని నబుల్సీ ప్రభుత్వం అందుకు నిరాకరించింది. పైగా నబుల్సీ మంత్రివర్గం 1957 జనవరి 19 న ఈజిప్టు, సిరియా,

సౌదీఅరేబియాలతో "అరబ్ సమైక్యతకు" సంబంధించిన ఒక ఒకంబడికను కుదుర్చుకుంది. ఫిబ్రవరి 13న, 1948 నాటి ఆంగ్లో-జోర్డానియన్ ఒడంబడికను రద్దుచేసింది. దేశంలోని బ్రిటిష్ సైనిక స్థావరాల్ని పీకివేయాల్సిందిగాను, బ్రిటిష్ సేనలు దేశంనుంచి వైదొలగవల్సిందిగాను నబుల్సీ ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసింది. 1957 ఏప్రిల్ మొదటివారంలో సోవియట్ యూనియన్‌తో దౌత్యసంబంధాలను నెలకొల్పు కోడానికి నిర్ణయం తీసుకొంది.

నబుల్సీ మంత్రివర్గ నిర్ణయాలు, పశ్చిమదేశాలవారికి, దేశంలో అభివృద్ధి నిరోధక వర్గాలకు రుచించలేదు. ఉభయులకు రోషావేశాలు పెరిగాయి. ఏదోవిధంగా నబుల్సీ ప్రభుత్వాన్ని పడగొట్టడానికే సామ్రాజ్యవాదులు నిశ్చయించుకున్నారు. ఇందుకు అనుగుణ్యంగానే, జోర్డాన్‌లోని తెగల నాయకులకు, ముస్లిం అభివృద్ధి నిరోధక ముఠా నాయకులకు లంచాలిచ్చేందుకుగాను అమెరికా రాయబారి 1 కోటి డాలర్ల ధనాన్ని హుస్సేన్ రాజుకి రహస్యంగా అందించాడు. అమెరికన్ పాలకవర్గాల సాయంతో దేశంలోని అభివృద్ధి నిరోధకముఠా నబుల్సీ మంత్రివర్గం రాజీనామా చేయవల్సిందిగా వత్తిడి తెచ్చింది. 1957 ఏప్రిల్ 10న మంత్రివర్గ సంక్షోభం ఏర్పడింది. దేశంలో అల్లకల్లోలం ఏర్పడింది. అనేక హత్యలు జరిగాయి. దేశంలో అసంతృప్తిని అణచేందుకు అమెరికా సైన్యాల్ని జోర్డాన్‌కు పంపింది. లెబనాన్ తీరంలో అమెరికన్ యుద్ధనౌకలు మోహరించబడ్డాయి. మరో వైపునుండి టర్కీ, ఇరాక్

సైన్యాలు జోర్డాన్ సరిహద్దుల్లో మోహరించబడ్డాయి. అమెరికా జోర్డాన్‌కు చేసే ఆర్థిక సహాయాన్ని 70 లక్షల డాలర్ల నుండి 3 కోట్ల 12 లక్షల డాలర్లకు హెచ్చించింది. ఇదే సమయంలో జోర్డాన్‌లో అమెరికా సైనిక స్థావరాల్ని నెలకొల్పడానికి జోర్డాన్‌తో సంప్రదింపులు ప్రారంభించింది.

ఆ విధంగా చేయిజారిపోతున్న ఒక ప్రధాన కీలక ప్రాంతాన్ని రక్షించుకొనేందుకు సామ్రాజ్యవాదులు యింత కుట్రపన్నారు. ఇతర మనబర్ని మంత్రివర్గం పతనమైంది. 1957 ఏప్రిల్ ఆఖరునాటికి పశ్చిమదేశాల పక్షపాతియైన ఇబ్రహీంహాషీంను గద్దెనెక్కించాడు. పోలీసు నిరంకుశ పాలన ఏర్పడింది. దేశంలోని అన్ని రాజకీయ పక్షాలను, కార్మిక సంఘాలను తదితర ప్రజాసంస్థలను నిషేధించారు. ప్రజలచేత ఎన్నుకోబడ్డ పార్లమెంటును రద్దుచేశారు. వేలాదిమందిని జైళ్ళలో పెట్టారు. అనేకమందిని చిత్రహింసల పాల్జేశారు. దీనినంతనూ కప్పిపుచ్చుకోడానికి, అన్ని దేశాలలోని అభివృద్ధి నిరోధకులకు మామూలు పాతపాటైన — "సోవియట్ కమ్యూనిస్టు "భూతాన్ని" చూపించారు.

జోర్డాన్‌లో సంభాషణలు పూర్తయిన తర్వాత అమెరికా జోర్డాన్‌కు మొదట్లో 1 కోటి డాలర్లను యిచ్చింది. ఆ తర్వాత మరో 80 లక్షల డాలర్లను "సహాయం" పేరిట కేటాయించింది.

ఈ విధంగా జోర్డాన్ సంపూర్ణంగా బ్రిటిష్, అమెరికన్ పలుకుబడిలో చిక్కుకుంది. హుస్సేన్ రాజుపట్ల, జోర్డాన్ ప్రభుత్వంపట్ల ప్రజలకెంత "భక్తి శ్రద్ధ" లున్నాయో

"న్యూస్" అనే అమెరికన్ పత్రికా విలేఖరి వెల్లింగ్టన్‌లాంగ్ యిలా వ్రాస్తున్నాడు :

"జోర్డాన్ ప్రజల్లో 20 శాతం మాత్రమే హుస్సేన్ రాజును, ఆయన ప్రభుత్వాన్ని బలపరుస్తున్నారు. అందులోనూ వీరిలోనే కొంతమంది వారం తిరిగి వచ్చేసరికి ప్రభుత్వానికి వ్యతిరేకంగా మారిపోతున్నారు."

అంతేకాదు. 1957 ఆగస్టులో టర్కీ సందర్శించినప్పుడు హుస్సేన్ రాజు డల్లెస్ ప్రతినిధి లాయ్ హెండర్సన్‌తో ఒక ఒడంబడిక కుదుర్చుకున్నాడు. దీని ప్రకారం గతంలో బ్రిటిషు సైన్యాల అధీనంలోవున్న సైనికస్థావరాల్ని యిప్పుడు అమెరికాకు కౌలుకివ్వడానికి హుస్సేన్ రాజు అంగీకరించాడు. అలాగే ఇప్పటికే, లాస్ ఏంజెల్స్ అనే అమెరికన్ గుత్త వ్యాపారికి జోర్డాన్‌లో 1/3 వ వంతు భూభాగాన్ని నూనె త్రవ్వకాలకోసం హుస్సేన్ ప్రభుత్వం కౌలుకిచ్చింది. ఇటీవలనే ప్రభుత్వ ప్రతినిధివర్గం ఒకటి వాషింగ్టన్ వెళ్ళి అమెరికా ఆధిపత్యంలోవున్న అంతర్జాతీయ బ్యాంకు ప్రతినిధులతో సంప్రతింపులు సాగించింది. ఈ సంప్రతింపుల ఫలితంగా జోర్డాన్‌లో 4 కోట్ల డాలర్ల పెట్టుబడితో అమెరికన్ బ్యాంకు నొకదాన్ని తెరవడానికి నిర్ణయం తీసుకున్నారు. అంతేగాదు. ఇక పశ్చిమాసియా పథకం క్రింద అమెరికా జోర్డాన్‌తో జరుపుతున్న ఎగుమతి దిగుమతి వ్యాపారాన్ని పరిశీలించినా అమెరికన్ గుత్తవ్యాపారుల హస్తలాఘవం యిట్టే బోధపడుతుంది. 1956 మొదట్లో అమెరికా జోర్డాన్‌లో 20 లక్షల 70 వేల డాలర్లు ఖరీదుచేసే ఎగుమతి వ్యాపారం జరిపితే

అది 1957 సం॥ మొదట్లో 30 లక్షల 70 వేల డాలర్లకు జేరుకుంది. అంటే జోర్డాన్‌నుండి ఎగుమతులు క్షీణించిపోవడంతో ఎగుమతి - దిగుమతి వ్యాపారం సమతూకంలో జరగడం లేదన్నమాట.

హుస్సేన్ రాజు అభ్యర్థనపై జోర్డాన్‌కు అమెరికా, 1958 జూలై 20 న 1 కోటి 25 లక్షల డాలర్ల అదనపు "ఆర్థిక సహాయాన్ని" అందించింది. జోర్డాన్‌కు "కష్టసమయంలో ఆదుకునేందుకు" ఈసహాయాన్ని యిస్తున్నామని అమెరికా ప్రకటించింది. కానిజోర్డాన్ పత్రికలు ఈసహాయంలోని గుట్టును బయటపెట్టాయి. ఇందులో అత్యధికభాగం సైనిక వ్యయానికేనని ప్రకటించాయి.

తమ దేశద్రోహకర పాత్ర ఎక్కడ బయటపడిపోతుందోనని జోర్డాన్ పాలకులు ఏదో పార్లమెంటును సమావేశ పరచినట్లేవుండి, వీలుచిక్కినప్పుడు తమ తప్పుడు కార్యకలాపాలకు ఎంత బలప్రయోగంతోనైనాసరే పార్లమెంటు అనుమతిని పొందడానికి కూడా వెనుకాడడం లేదు. అందుచేతనే జోర్డాన్ పాలకులు ప్రజలచే ఎన్నుకోబడ్డ పార్లమెంటు గొంతునొక్కి దాన్ని తమ యిచ్ఛవచ్చినట్లు వినియోగించుకుంటున్నారు. ఈ విషయమై "అల్‌షాయబ్" అనే పత్రిక 1957 అక్టోబర్ 1 న యిలా స్పష్టపర్చింది. "జోర్డాన్ పాలకవర్గం చేయరాని హింసాకృత్యాలంటూ లేవు. ప్రస్తుత కీలుబొమ్మ ప్రభుత్వానికి పార్లమెంటరీ అనుమతిని పొందటానికి పార్లమెంటు సభ్యుల్ని నానాహింసలు పెట్టింది. కొంతమంది పార్లమెంటు సభ్యుల

చుట్టపక్కాలని వరుసబెట్టి అరెస్టుచేసింది. ప్రభుత్వానికి అనుకూలంగా వోటుచేయమని తమవారికి నచ్చచెప్పవలసిందిగా వీరిపై వొత్తిడి తెచ్చింది"

ఇంతవొత్తిడివున్నా పార్లమెంటులో ప్రభుత్వానికి ప్రతిఘటన తప్పిందికాదు. 7 గురు ప్రతినిధులు ప్రభుత్వానికి అనుకూలంగా వోటుచేయ నిరాకరించారు. పార్లమెంటులో దొంగవోటింగ్ పద్ధతిని అమలుజరిపినందుకు నిరసనగా తమ పార్లమెంటు సభ్యత్వానికి రాజీనామా యిస్తున్నామని ప్రభుత్వ అనుకూలురైన ఈ 7 గురు సభ్యులూ ప్రజలకు చేసిన ఒక విజ్ఞాపన పత్రంలో పేర్కొన్నారు.

హుస్సేన్ ప్రభుత్వం యింతటితో ఆగలేదు. ప్రతిపక్ష పార్టీలకు చెందిన అనేకమంది పార్లమెంటు సభ్యుల్ని అరెస్టు చేసింది. కొంతమందిని దేశంనుండి బహిష్కరించింది. ఫలితంగా పార్లమెంటులో 'కోరం' (సమావేశం జరగడానికి కావల్సిన కనీససంఖ్య) కు సరిపడాకూడా సభ్యులు లేక పోయారు. పార్లమెంటరీ రాజ్యాంగ చరిత్రలో యింతకంటే దారుణమైన విషయం మరొకటి వుండబోదు !

అమెరికా ఒత్తిడివల్ల హుస్సేన్ రాజు, విదేశాంగమంత్రి సామీర్ అల్‌రిఫాయీ 1957 నవంబరు నెలమొదట్లో పశ్చిమాసియాలో సామ్రాజ్యవాదులకు మరోతాజేదారుగా తయారైన ఇజ్రాయల్‌తో రహస్య ఒడంబడిక కుదుర్చుకున్నారని విదేశీ పత్రికల్లో వార్తలు వచ్చాయి. దీనితో జోర్డాన్ ప్రజల్లో మరింత అలజడి వ్యాపించింది. ఇంతటి ఉద్రిక్తతను కూడా లెక్కచేయకుండా జోర్డాన్ ప్రభుత్వం 1957 నవంబర్

మధ్యభాగంలో డల్లెస్ ఐక్ పశ్చిమాసియా పథకాన్ని సూత్రప్రాయంగా అంగీకరించింది. దీనితో అసలే మండి పోతున్న ప్రజల క్రోధాగ్నిలో మరింత ఆజ్యంపోసినట్లయింది. ఫలితంగా జెరూసలం, హాలీల్, నబ్లుస్, తుల్కారమ్, జెనీన్, రామల్లా, జెరికో తదితర పట్టణాల్లో నూకొట్లాటలు, ప్రదర్శనలు సర్వసాధారణ ఘటనలుగా రూపొందినాయి. ప్రభుత్వం మాత్రం అభివృద్ధి నిరోధక విధానాల్ని మార్చుకుని ప్రజా సమస్యల్ని పరిష్కరించడానికి బదులు, ఆనువాయితీగా వస్తున్న పాతపద్ధతుల్ని పట్టుకు వ్రేలాడింది. మీదుమిక్కిలి ప్రజల తిరుగుబాటును అణచడానికి హుస్సేన్ రాజు అమెరికా ఆరవ నౌకాదళం సహాయాన్ని అర్థించాడంటే పరిస్థితులు ఎంతటి విషమరూపం ధరించాయో తేటతెల్లమవుతుంది. గత్యంతరంలేక ప్రజలు చివరకు సాయుధ సంఘర్షణకుకూడా దిగాల్సి వచ్చింది.

ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల కుట్రలకు వ్యతిరేకంగా న్యాయసమ్మతమైన పోరాటాన్ని నడుపుతున్న జోర్డాన్ ప్రజలకు తోటి అరబ్ ప్రజల, ప్రపంచంలోని అభ్యుదయశక్తుల సహాయసానుభూతులున్నాయి. ఎటుతిరిగీ హుస్సేన్ ప్రభుత్వమే, సామ్రాజ్యవాదులనుండి తాత్కాలిక సహాయాన్ని పొందుతున్నా, ఏకాకిగా నిలబడాల్సివచ్చింది. సభ్య ప్రపంచం అండదండలను కోల్పోయింది.

ఈ విధంగా ఆంతరంగిక వ్యవహారాల్లో అభివృద్ధినిరోధకుల పంచజేరి, అంతర్జాతీయరంగంలో ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదుల కుట్రలకు జోర్డాన్‌ను పాచికగా వినియో

గించ వీలుకలిగిస్తున్న హుస్సేన్‌రాజు ప్రభుత్వం యింటా బయటా కూడా ప్రజల ఆదరాభిమానాల్ని కోల్పోయింది. ఈ విషయాన్ని అమెరికన్ పత్రికలు సహితం బాహాటంగా వెల్లడించాయి. "న్యూయార్క్ హెరల్డ్ టెలిగ్రాం అండ్ సన్" అనే పత్రిక ఈక్రింది వాస్తవాన్ని బయటపెట్టింది:

జోర్డాన్‌లోని పశ్చిమదేశాల అనుకూలురు ఏదో విజయం సాధించినట్లు చంకలెగ రేస్తున్నారు. కాని అది ఒట్టి భ్రమ మాత్రమే. నివురు గప్పిన నిప్పులావున్న పరిస్థితుల్ని, అమెరికా "సహాయాన్ని" తమ విజయంగా భావించినవారి భ్రమలు పటాపంచలైనాయి."

# సైనిక జోక్యం

ఈవిధంగా బాగ్దాద్‌కూటమి చర్యలను, ఐక్ పశ్చిమాసియా పథకాన్ని బలపరుస్తూ వచ్చిన జోర్డాన్ తన స్వాతంత్ర్య. సార్వభౌమాధికారాలకే కాకుండా సోదర అరబ్ దేశాల జాతీయ ప్రయోజనాలకే విఘాతం కలిగించేవిధంగా ప్రవర్తిస్తోంది. ఇందు కనుగుణ్యాంగానే తమచేయి జారి పోతున్న పశ్చిమాసియాను మరికొంతకాలం జలగలలా పీల్చేందుకై బ్రిటన్, అమెరికాలు అరబ్‌జాతుల్ని చీల్చి అక్కడి ప్రజలకు వ్యతిరేకంగా సంయుక్త కూటముల నిర్మాణానికి పూనుకున్నారు. ఫలితంగానే సర్వస్వతంత్ర దేశాలైన ఈజిప్టు - సిరియాలతో ఏర్పడ్డ ఐక్య అరబ్ రిపబ్లిక్‌కు వ్యతిరేకంగా 1958 ఫిబ్రవరి 14 న ఇరాక్ - జోర్డాన్‌లతో "అరబ్ సమాఖ్య" నొకదాన్ని యేర్పరిచారు. తద్వారా తమ ఆశయాల్ని నెరవేర్చుకోవచ్చునని ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు ఆశించారు. కాని పరిస్థితులు యిందుకు భిన్నంగా మారాయి. కేవలం స్నేహ సహకారాలు ప్రాతిపదికగా యేర్పడ్డ ఐక్య అరబ్ రిపబ్లిక్ (ఈజిప్ట్, సిరియా, యెమెన్‌ల సమాఖ్య) ఒకవైపున దినదిన ప్రవర్ధమాన మవుతూవుంటే

మరోవైపున కూటరాజకీయాలు ప్రాతిపదికగా యేర్పడ్డ ఇరాక్ - జోర్డాన్ సమాఖ్య మనుగడ మూన్నాళ్ళముచ్చటే అయింది.

ఇరాక్‌లో 1958 జూలై 14న విద్రోహియైన ప్రధాని నూరీ అల్ సయీద్‌ను, ఫైజుల్‌ను, ఆయన పినతండ్రిని చంపడంతో రాచరికం రద్దయింది. ఇరాక్‌ను రిపబ్లిక్‌గా ప్రకటించారు. విప్లవంలో ప్రజలుప్రత్యక్షపాత్ర వహించకపోయినా, ఇరాక్‌లో వచ్చిన సైనిక విప్లవానికి ఒక ప్రత్యేక ప్రాముఖ్యతవుంది. దేశ ప్రజల్లో అంతర్గతంగావున్న రాచరిక, సామ్రాజ్యవాద వ్యతిరేకతకూడ యిందులో ప్రతిబింబించిందనే చెప్పాలి. అంతటితో పశ్చిమాసియాలో సూయజ్ ఉదంతం తర్వాత సామ్రాజ్యవాద ప్రయోజనాలకు మరో ముప్పు వాటిల్లింది.

అంతేగాదు, ఇరాక్‌లో నూతన ప్రభుత్వం అధికారంలోకి రావడంతో సామ్రాజ్యవాదులు పన్నిన "అరబ్ సమాఖ్య"నుండి ఇరాక్‌ను ఉపసంహరిస్తూ 1958 జూలై 19న అధికారప్రకటన వెలువడింది. అలాగే కొద్దిరోజులలో బాగ్దాద్ కూటమినుండి విడివడినా ఆశ్చర్య పడాల్సిన పనిలేదు.

ఇంతటితో ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులకు కాళ్లాడలేదు. ఇరాక్-జోర్డాన్ సమాఖ్య నిర్వీర్యమైంది. కాని బాగ్దాద్‌కూటమిలోని "బాగ్దాద్" శక్తివిహీనమైంది. ఇదే సమయంలోఇరాక్ విప్లవానికిముందు రెండునెలలుగా లెబనాన్‌లో పశ్చిమరాజ్యాల అనుకూలుడైన షామూన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజా విప్లవం సాగుతోంది. ప్రజాబలంలేని

షామూన్ అమెరికా సహాయాన్ని అర్థించాడు. ఇరాక్‌లో అనుకూల ప్రభుత్వం పతనం చెందడంతో శ్వాస ఆడని అమెరికా ఇదే అదను అనుకుని 1958 జూలై 15 న లెబనాన్‌లోకి హుటాహుటిని సైన్యాన్ని దింపింది. దాన్ని సమర్థించుకోడానికి అనేక ముసుగులు పన్నింది. ఇంతకూ ఆంగ్లో-అమెరికన్ల లక్ష్యం జోర్డాన్-లెబనాన్‌లను వేదికలుగా చేసుకొని ఇరాక్ రిపబ్లిక్‌ను దెబ్బతీయడమే. అటు బ్రిటిష్‌వాళ్ళు ఇదే సమయం చూచుకొని హుస్సేన్‌రాజు అభ్యర్థన పేరుతో జూలై 17 న తమ సైన్యాల్ని అమ్మాన్‌లోకి ఫురికించారు. అలాగే అమెరికా కూడా హుస్సేన్ దొంగ ప్రభుత్వాన్ని రక్షించడంకోసం ఆయుధాలను, పెట్రోల్‌ను జోర్డాన్‌కు హుటా హుటిని సరఫరా చేస్తున్నారని అమ్మాన్ నుండి వార్తలు వెలువడ్డాయి. అంతేగాదు, లెబనాన్‌లోని అమెరికన్ దురాక్రమణ దళాలు పెట్రోల్‌ను అమ్మాన్‌కు విమానాలద్వారా చేరవేశారు. జోర్డాన్‌లో అసలు నూనె బావులుగాని, శుద్ధి కర్మాగారాలుగాని లేనేలేవు. భ్రష్టత్వం పొందిన ఇరాక్‌లోని ఫైజల్ ప్రభుత్వం ఎక్కువ ఖరీదు పెట్టి నూనెను ట్రాక్టర్లద్వారా బాగ్దాద్‌నుండి అమ్మాన్‌కు చేరవేస్తూండేది. కాని ఇప్పుడు ఇరాక్ విప్లవం విజయం పొందడంతో జోర్డాన్‌కు నూనె సరఫరా నిలచిపోయింది. ఇంతకూ నూనెను విమానాలద్వారా చేరవేసినాగాని జోర్డాన్ నూనె కొరతను తీర్చగల్గుతామా అని అమెరికా, బ్రిటిష్ దురాక్రమణ శక్తులు అనుమానంలో పడ్డాయని పశ్చిమ దేశాల వార్తా సంస్థల కథనం. ఆ విధంగా ఇసెన్‌హోవర్ - మాక్మి

లన్‌లు ఐక్యమై కుట్రపన్నడంతో పశ్చిమాసియా పరిస్థితి మునుపెన్నడూ లేనంత తీవ్రరూపం దాల్చింది.

లెబనాన్-జోర్డాన్‌లలో, బ్రిటన్, అమెరికాల చర్యల్ని ఉభయ దేశాల్లోని ప్రజలూ, పత్రికలూ కూడా తీవ్రంగా విమర్శిస్తున్నాయి. ఈ విషయమై "డైలీహెరాల్డ్" అనే పత్రిక యిలా వ్రాసింది:

"బ్రిటన్-అమెరికాలు ఎంత కలిసికట్టుగా వ్యవహరించినా పశ్చిమాసియాను బలవంతంగా అణచబూనుకోవడం అసంభవం. అదేవిధంగా ఆయా దేశాల్లోని ప్రజల్ని రెచ్చగొట్టడంవల్ల మనం అక్కడ నూనె సప్లయిని దక్కించుకోవడంకూడా కష్టమే."

చివరకు బూర్జువాపత్రికయైన "మాంచెస్టర్ గార్డియన్"కూడా "జోర్డాన్‌లో బ్రిటన్ సైనిక జోక్యం అత్యంత విపత్కర పరిస్థితులకు దారితీసేదిగా వుందని హెచ్చరించింది.

అంతేగాదు, జోర్డాన్ సమస్యకు శాశ్వత పరిష్కారం అది ఐక్య అరబ్ రిపబ్లిక్‌లో విలీనం కావడమేననికూడా ఈపత్రిక వ్రాసింది.

"జోర్డాన్‌లో ప్రజాతంత్రయుత రాచరికాన్ని నెలకొల్పాలనుకోవడం వట్టి భ్రమే అవుతుంది. ఎన్నికలు జరగడమూ, దానివల్ల ప్రజాతంత్రం కొంత పెరగడమూ అంటే రాచరికం పరిమితం కావడమే అని గ్రహించి జోర్డాన్‌రాజు హుస్సేన్ ఇటీవల పార్లమెంటులో తన కిష్టంలేనివారినందరినీ గెంటిపారేశాడు...అక్కడ జనవాక్యసేకరణ జరిగితే మెజారిటీ ఓటర్లు జోర్డాన్ ఐక్య అరబ్ రిపబ్లిక్‌లో విలీనం కావాలనే వోటు చేస్తారు....

"సుమారు 40 ఏళ్ళనాడు బ్రిటిష్ జోర్డాన్‌ని ప్రత్యేక దేశంగా ఏర్పాటుచేసింది. ఆనాడు జరిగిన ఆ పొరపాటును, ఇప్పుడది శాంతియుతంగా మరో పెద్దదేశంలో లీనంకావడానికి తోడ్పడడంద్వారా మనం దిద్దుకోగలుగుతాము." ("మాంచెస్టర్ గార్డియన్" 1958 జూలై 26)

తమ తప్పిదాన్ని అంగీకరించిన లిబరల్ బూర్జువా పత్రిక అభిప్రాయాల్ని దాని మిత్రవర్గాలు ఖాతరుచేస్తాయా?

బ్రిటన్‌లో లేబర్‌పార్టీ ప్రముఖులుకూడా బ్రిటన్ జోక్యాన్ని తీవ్రంగానిరసించారు. ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు తమ దురాక్రమణ చర్యల్ని విరమించకపోతే మరో యుద్ధానికి దారితీసినవారవుతారని సోవియట్ యూనియన్ హెచ్చరించింది. భారత, చైనాలతో సహా, పశ్చిమదేశాలకు అనుకూలంగావుండే స్వీడన్, కెనడాలుకూడ ఈ దురాక్రమణ చర్యలను ఖండించారు. జోర్డాన్‌నుండి బ్రిటిష్, లెబనాన్ నుండి అమెరికా సేనలు తక్షణమే ఉపసంహరించబడాలని జూలై 18 న భద్రతా సమితిలో సోవియట్‌యూనియన్ ఒక తీర్మానాన్ని ప్రతిపాదించింది.

ఇదే విధంగా జోర్డాన్‌లోని ప్రధాన రాజకీయ సంస్థ "నేషనల్ బ్లాక్" నాయకులు కూడా -జోర్డాన్‌లో బ్రిటిష్ జోక్యానికి నిరసిస్తూ, దేశంనుండి సేనల్ని తక్షణమే ఉపసంహరించబడేటట్టుచూడాలంటూ జూలై 19 న ఐ. రా. స. కార్యదర్శికి, భద్రతాసమితి అధ్యక్షులకు ఒక కేబుల్ పంపారు. "జోర్డానియన్ నేషనల్ బ్లాక్" "సామ్రాజ్యవాద ఏజెంటు అయిన హుస్సేన్ ప్రభుత్వాన్ని" గుర్తించడం లేదనికూడా వారా కేబుల్‌లో స్పష్టంచేశారు.

జోర్డాన్‌లో రోజు రోజుకి వింత పరిణామాలు సంభవిస్తున్నాయి. ఇరాక్ విప్లవంతో బేజారెత్తిన హుస్సేన్ ప్రభుత్వం తనకు అధికార భ్రష్టత్వం ఎక్కడ సంభవిస్తుందోనని పశ్చిమదేశాల అండతో గతంలోవలెనే నేడుకూడా ప్రజలపైన తీవ్ర నిర్బంధ విధానాన్ని అమలుజరుప బూనుకున్నాడు. దేశంలో సర్వత్రా అశాంతి పరిస్థితులు ఏర్పడ్డాయి. అక్కడకూడ ఏ క్షణంలోనైనా అగ్నిపర్వతం బ్రద్దలుకావచ్చు.

అప్పుడే బ్రిటిష్ సైన్యాలపై జోర్డాన్ ప్రజలలో అసంతృప్తి జ్వాలలు తీవ్రంగా రేగుతున్నాయని, జోర్డాన్ సైన్యంలోని జూనియర్ ఆఫీసర్లుకూడా తీవ్ర అసంతృప్తి వెళ్లకక్కుతున్నారని " లండన్ టైమ్స్ " పత్రిక పశ్చిమాసియా విలేఖరి వ్రాశాడు. 1949 నాటి పాలస్తీనా యుద్ధసమయంలో జెరూసలమ్‌కు సైనిక గవర్నరుగా పనిచేసిన మాజీ జోర్డాన్ సైన్యాధిపతి అబ్దుల్లా ఆల్ తల్ - సామ్రాజ్యవాదదురాక్రమణను ప్రతిఘటించి, సామ్రాజ్యవాద బానిస సంకెళ్ళనుండి విడివడడానికి యితర అరబ్ దేశాలదీక్షా దక్షతనే జోర్డాన్ సైన్యంకూడా అనుసరించాలని యిటీవల ఒక ప్రకటనలో విజ్ఞప్తిచేశారు. అరబ్ విమోచనోద్యమానికి తూట్లు పొడవడానికి పాలస్తీనాలో మిగిలినభాగాన్ని ఇజ్రాయిల్‌కు ధారాదత్తం చేయడడానికే జోర్డాన్‌ను స్థావరంగా వినియోగించుకో జూస్తున్నారు" అని కూడా అబ్దుల్లా స్పష్టపరిచారు. అందుచేతనే జోర్డాన్ ప్రజలు తమస్వేచ్ఛాస్వాతంత్ర్యాలని కంటికిరెప్పలా కాపాడుకోవాలని ఆయన విజ్ఞప్తిచేశారు.

49

# పశ్చిమాసియా శాంతికై సోవియట్ షట్సూత్ర ప్రణాళిక

ఇతరదేశాల జాతీయ స్వాతంత్ర్యాన్ని గుర్తించడం, యితరుల ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కల్పించుకోక పోవడం, స్నేహ, సహకారాల ప్రాతిపదికపై శాంతియుత సహజీవనం — యివే గత 40 సంవత్సరాలుగా సోవియటు యూనియన్ వైదేశిక నీతికి మూలసూత్రాలుగా వుంటూ వచ్చాయి. ఇవే సూత్రాల్ని యిప్పుడు సోవియట్ యూనియన్ పశ్చిమాసియాపట్లకూడా అనుసరిస్తోంది. అయితే ఇటువంటి సూత్రాలనే అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సులుకూడా వల్లిస్తున్నాయి. కాని ఆచరణలో మాత్రం సామ్రాజ్యవాదులకు వలే 'తన' కొకనీతీ, యితరులపట్ల వేరొకనీతినీ పాటించడం సోవియట్‌కు అలవాటు లేదు !

ఈ విషయం పశ్చిమాసియా పరిస్థితిని పరిశీలిస్తే మరింత సుబోధకమవుతుంది. పశ్చిమాసియాలో సామ్రాజ్యవాదులకువలే సోవియట్ రష్యాకు యెక్కడా సైనిక స్థావరాలుగాని, లేదా ఆయా దేశాల్లో తమకు "ప్రత్యేక రక్షణలుగాని లేవు. మీదుమిక్కిలి పశ్చిమాసియా దేశాల్లో

దేనికి ముప్పువాటిల్లినా ఆయా దేశాలకు సోవియట్ అండగా నిలబడింది. గతంలో అక్టోబర్ విప్లవంతో ఉత్తేజం పొందిన ఆయా దేశాల జాతీయ విముక్త్యుద్యమాల అన్నింటిపట్లా - 1919 నాటి ఆఫ్గనిస్థాన్ స్వాతంత్ర్యసమరం; 1918 - 21 ఇరాక్, సిరియా, లెబనాన్‌లలో విమోచనోద్యమం; 1918 - '23 నాటి టర్కీ జాతీయ విమోచనోద్యమంపట్ల - ఇటీవల ఈజిప్టు, సిరియా, ఇరాక్‌ల స్వాతంత్ర్య పోరాటంపట్ల సోవియట్ యూనియన్ సహాయసానుభూతుల్నే పదర్శిస్తూ వచ్చింది.

పశ్చిమాసియాలో శాంతిపరిస్థితుల్ని నెలకొల్పడానికై ఇటీవలకాలంలో సోవియట్ ప్రభుత్వం 6 ప్రధాన సూత్రాలతో కూడుకున్న ఒక ప్రణాళికను ప్రపంచం ముందు వుంచింది.

1. వివాదాస్పదమయిన సమస్యల్ని శాంతియుత పద్ధతుల ద్వారా, ప్రత్యక్షసంప్రతింపులద్వారా, పరిష్కరించడం ద్వారా పశ్చిమాసియాలో శాంతిని రక్షించడం;

2. పశ్చిమాసియా దేశాల ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కల్పించుకోరాదు. ఈ దేశాల స్వాతంత్ర్య సార్వభౌమాధికారాల్ని గౌరవించడం.

3. సైనికకూటాల్లో ఈ దేశాల్ని యిరికించడానికి జరిగే ప్రయత్నాలకు స్వస్థి చెప్పడం.

4. పశ్చిమాసియా దేశాల భూభాగాలనుండి విదేశీ స్థావరాల్ని, విదేశీ సేనల్ని ఉపసంహరించడం.

5. పశ్చిమాసియా దేశాలకు ఆయుధ సరఫరాను నిలిపివేస్తూ పరస్పర ఒడంబడిక చేసుకోవడం;

6. పశ్చిమాసియా దేశాల స్వాతంత్ర్య, సార్వభౌమాధికారాలకు ముప్పురాకుండా, ఎటువంటి రాజకీయ, సైనిక, తదితర షరతులు విధించకుండా ఆయాదేశాల ఆర్థికాభివృద్ధికి తోడ్పడ్డం.

ఇంతకంటే అనుకూలమైన ప్రణాళికను ఏ ప్రజాతంత్రవాదీ ఆశించడం కష్టం. కాని బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సులు ఈ ప్రతిపాదనలను తిరస్కరించాయి. తిరస్కరించడానికి కారణం సోవియట్ యూనియను కమ్యూనిస్టుదేశం అవడం వల్ల కాదు. ఈ ప్రణాళికను ఆమోదిస్తే శతాబ్దాలుగా పశ్చిమాసియా సంపదను దోచుకుతినడానికి అలవాటుపడ్డ సామ్రాజ్యవాదుల ప్రయోజనాలకు భంగం కలుగుతుందనే.

ఏది ఏమైనప్పటికీ పశ్చిమాసియాలో పలుప్రాంతాల్లో సామ్రాజ్యవాదులకు చుక్కెదురవుతున్నది. ఎమన్ 1934, 1951 సంవత్సరాల్లో బ్రిటన్‌తో కుదుర్చుకున్న ఒడంబడికను రద్దుచేయడానికి ఉద్యుక్తురాలవుతోంది. అలాగే లిబియా 1953 నాటి ఆంగ్లో - లిబియన్ ఒడంబడికను కాలదన్నడానికి ప్రయత్నిస్తోంది. ఒకవైపున సైప్రస్, ఆల్జీరియాలలో స్వపరిపాలన నిమిత్తం సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా గెరిల్లా పోరాటం సాగుతోంది. ఏడెన్, మస్కాట్, ఓమన్, కువాయత్, తదితర బ్రిటిష్ రక్షితప్రాంతాలు స్వాతంత్ర్యం పొందేరోజు దగ్గరపడుతోంది.

ఆవిధంగా పశ్చిమాసియా, ఉత్తరాఫ్రికా దేశాలలో వలస విధానానికి వ్యతిరేకంగా జాతీయ విముక్తి ఉద్యమాల సద్దు నానాటికీ ఎక్కువవుతోంది. ఈ ఉద్యమా లన్నింటికి భారత ప్రజల సహాయ సానుభూతులు లభిస్తాయనడంలో సందేహంలేదు.



## సవరణలు

15 వ పేజీలో 11 వ పంక్తిలో 1954 కు బదులు 1956 సం॥ అని వుండాలి; అలాగే 37 వ పెజీ 8 వ పంక్తిలో "ఇతర మనబర్గు మంత్రి వర్గం" అని పడింది. "ఇంతటితో నబుల్సీ మంత్రివర్గం" అని చదువు కోవాలి. అలాగే 44 వ పేజీలోని 21 వ పంక్తిలో "బాగ్దాద్ కూటమి లోని బాగ్దాద్" అని వుంది. అలాకాక "బాగ్దాద్‌లేని బాగ్దాద్ కూటమి" అని చదువుకోవాలని ప్రార్థన.

